ఆర్యులారా!

ఇదివర కెందరో మహానుభావులు పెక్కుగ్రంథంబుల [illegible] యుండ వారందరికన్న నేమేటిబంటనని నీ[illegible]త్రంబును [illegible]దియించ నెంచినవాడనుగాను. ఇతరభాషలలోనుండు నవీనకథల మనవార లకు దెలుపవలెనను కుతూహలమున మదరాసు హైకోర్టు వకీలుగా నుండు మ-రా-రా-శ్రీ, సంబంధం మొదలియారుగారిచే అరవభాషన 'లీలావతీ సులోచన' యనుపేర వ్రాయబడ్డ నాటకమును కొంతమా ర్పులతో నానేర్చినకొలది తెనుంగుభాషయందు వచనకావ్యముగ రచియించితి.

మరణము, ఘోరప్రయాణము, వియోగము ఇత్యాదులశుభ సూచకములుగాన లీలావతి మరల బ్రతికి శివవర్మను బెండ్లాడినట్లు వ్రా యబడియె. నాటకమున శుకవాణి, గుణనిధు లొండొరుల వరించినట్లు ను చూపబడ్డది.

ఇదిదప్ప మరెద్దియుమార్పక మ-రా-రా-శ్రీ, గోవిందస్వామి రాజుగారియొక్కయు, మ-రా-రా-శ్రీ, కే. వి. వెంకటరామయ్యరుగారి యొక్కయు సహాయమున, నాఅరవనాటక కథను విని నానేర్చినకొలది నాంధ్రీకరించితి.

ఇందలి తప్పొప్పుల సవరించినను కృతార్థుని జేయుదురని పండి తవర్గమును బతిమాలువాడ.

నాముద్రలేనిప్రత్తులు మీచేజిక్కిన దయయుంచి నాకుదెల్ప వలయునని వేడెద.

అనంతపురం,
ది 14-8-05.

ఇటు సుజనవిధేయుడ భాగ్య
పామిడి-అయితిరాజు లక్ష్మీ-ను. ఇట్లుం
శాస్త్రి నానాటి

## పురుషులు.

1. వీరవర్మ—హస్తిపురరాజు.
2. విక్రమసేనుడు—లలితపురిరాజు.
3. మదనమోహనుడు—వీరవర్మకుమారుడు.
4. సుబుద్ధి—వీరవర్మమంత్రి.
5. గుణనిధి—మదనమోహనుని మిత్రుడు.
6. శివవర్మ—మదనమోహనుని దాయాది.
7. కటికలు—నల్గురు.
8. వృకోదరుడు—వ్యాధుడు.

పౌరులు బ్రాహ్మణులు &c.

## స్త్రీలు.

1. కాంచనాంగి—విక్రమసేనునిభార్య.
2. భారతి—వీరవర్మభార్య.
3. మృదువాణి—విక్రమసేనునికూతురు.
4. కోకిలాలాప— డిటో
5. శుకవాణి—వీరవర్మకూతురు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశంకరాయనమః.

# మృదువాణి.



## 1-వ అధ్యాయము.

శిరికిరవై సకలసుఖంబులకు నాకరంబై లలితపురియను నొక పట్టణంబుగలదు. దానిని రూపంబున మారునితోను, ధైర్యంబునఁ గుమారునితోను, రౌద్రంబునరుద్రునితోను, ఈవిని శిబికర్ణదధీచుల తోడను, అస్త్రశస్త్రవిద్యానైపుణ్యంబున నర్జునునితోడను, ధర్మనియతిని యమతనయునితోడను, సత్యంబున హారిశ్చంద్రునితోడను, దులదూగు విక్రమసేనుడను రాజుపాలించుచుండెను. ఆరాజుపత్నియగు కాంచనాంగి యందు మృదువాణియుఁ, గోకిలాలపయునను నిరువురుఁదనయలఁగాంచి సుఖంబున రాజ్యపాలన మొనర్చుచుండెను.

అతని సామంతరాజగు వీరవర్మ హస్తిపురినేలుచు భారతియను కాంతాలలామచే మదనమోహనుడను సుతుని శుకవాణియను సుతను గాంచి చతుస్సముద్రపరివృత భూవలయంబు నేకచ్ఛత్రంబుగ నేలు శక్రసన్నిభ విక్రమసేనునితోడ వియ్యమందెడి భాగ్యమెన్నడు గలిగెడినోయని యువ్విళ్లూరుచు, యజన, యాజన, అధ్యయన, అధ్యాపక దాన ప్రతిగ్రహనిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మణసేవాతత్పరుడై, అతిథి, అభ్యాగతులకు స్వాగతంబు చెప్పుచు, నియతిదప్పక రాజ్యమేలుచుండెను. ఇట్లుండ, విక్రమసేన వీరవర్మ సుతసుతులందరు బాలచంద్రునిమాడ్కి నానాటి

కభివృద్ధినొందుచు, కందుకాద్యనేక ఖేలనంబులచేతను, నృత్యగీతంబులచేతను మాతృపితృాది సకలబంధువర్గములకును తమగోము నామోదింపఁజేయుచుండిరి.

మృదువాణి సార్థకనామధేయయై తేనెలొలుకు పలుకులకులుకు వగలాడియయ్యెఁ, బయోముఖవిషకుంభంబుమాడ్కి హృదయంబున విషంబును అధరంబున సుధయుగలిగినదయ్యె. నిష్కపటహృదయయు, సదయయు, మందస్మితసుందరముఖారవిందయు, మృదుమృణాళంబుల బోలుకరయుగళయునై కరగిపోసిన కాంచనాంగియోయనదగు నా కోకిలాలపతి సయనుంగు చెలియలగు మృదువాణి మనోభీష్టంబుల కనుగుణముగ నడచుకొనుచుఁ, దలిదండ్రుల పూర్వార్జితార్జిత ధనమోయనఁ బలువురచేతి పూలబంతియై మెలంగుచుండె.

కోకిలాలపనుతనస్నుషగాఁగొనదుద్యుక్తుడై, స్వాతివానకై వేచిన శుక్తివలె నువ్విళ్లూరుచున్న వీరవర్మ జితవైరియై సకలదిగ్దేశాధీశ మస్తకన్యస్తపదయుగళుండగు విక్రమశేనునితో నీప్రసక్తిఁ జేసిననేమి కీడు మూడునోయనిమొడి భీతిచేతను, సీమంతినీలలామయగు నాకోకిలాలప మనోభీష్టంబెట్టిదియోయను సంశయముచేతను, చక్రవర్తిని సంచు నెరుంగనెంచిన యభీష్టముచేతను, తనసుతయగు శుకవాణినిలలితపురికంపెను.

అట, నాశుకవాణి లలితపురిఁజేరి, ఆటపాటల కోకిలాలప మృదువాణులతో గలసిమెలసి, నాయువతీమణుల ప్రాణపదకమై మెలంగుచు, నెవ్వేళ తన సోదరు నిగూఢరేఖలావణ్యంబుల కొంతసేపును, పాణ్డిత్యఖరి మఱికొంతసేపును, సకలకళాకోవిదత్వంబును నొకపరియు, అస్త్రశస్త్రవిద్యానైపుణ్యంబును నొక్కతడవయు, శాంతిదాంతాదిగుణముల నొకవేళను, భుజబలపరాక్రమంబుల నొక్కసమయంబునను, బొగడుచుఁ

గోకిలాలప మృదువాక్కుల మనస్సు మదనమోహనునియందు లీనమగు నటు చేసెను.

---

## 2-వ అధ్యాయము.

వీరవర్మ, శుకవాణిరామికిఁ జాలచింతించి, తనయమాత్యవరుండగు సుబుద్ధినంప, నాసచివుండు, విక్రమసేనునిజేరి, సవినయ, సముచిత, సంభాషణంబుల నిట్లు ప్రశంసించెను.

రాజా, అప్రతీపంబగు నీ ప్రతాపంబున సమస్తదేశాధీశులు సుఖంబుననున్నవారుయాగ, మంత్రతంత్రనిష్ఠాగరిష్ఠులై బ్రాహ్మణులును, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనా తత్పరులై క్షత్రియులును, వాణిజ్యవైభవంబుల వైశ్యులును హాలాగ్యసనకంఠరికగో సేతులై సైరుపంటలఁ బెట్టి బీదసాదలకుపకారులై శూద్రులును, సుఖంబుననున్నవారు దాయాది సామంతులెల్లరు సకాలంబున, దప్పక కప్పములొసంగుచున్నవారు. ఇటు సకలశోభాయమానంబుననున్న నీకులమును, దరింపఁజేయు, కన్యకామణు లిరువురను యుక్తవయసున వివాహితలగాఁజేయకుండిన పితరులు శిశుహత్య భ్రూణహత్యాదిపాతకంబుల పాలగుదురు కన్యాదానఫల మెవరెరుంగరు? తత్ఫలమువలదను వెకలులుగలరే? "అష్టవర్షా భవేత్కన్యా నవవర్షాతురోహిణీ దశవర్షాభవేద్గౌరీ అతఊర్ధ్వం రజస్వలా" యను శ్లోకముచే కన్యాదానఫల ప్రాప్తినిగోరువారెడేండ్లకన్నియకు పెండ్లిజేయవలయునని యేర్పడుచున్నది. చిన్ననాడె కన్నియకుఁ బెండ్లిచేసిన, పండుగపర్వాదుల జామాతనుపిలుపించి, తగుమర్యాదల జేయుచు, బడుచులకు బెనిమిటియందనురాగము హెచ్చి, మచ్చికపెచ్చుమీరి, యుక్తవయస్సున నొండొరులత్యైకత్యంబున నుందురనుతలంపున నార్యులిట్టినిబంధనకల్పించి యుండవచ్చును. రాచకన్నియలకు

స్వయంవర సాం ప్రదాయముగూడగలదు. నీసుతలు యు క్తవయస్కు-లయ్యుండ,నిహసుఖంబులకు వెలి జేయదగునా? యని ప్రశంసించుచుండ రాజుగారి రాకకై రాజ్ఞి వేచియున్నట్లొక చీటివచ్చెను.

కాంచనాంగి తన యంతిపురమున సుతలతోడను, శుకవాణితోడను పరివేష్టితయై వినోదార్థ మిట్లు ప్రశంసించె.

"కన్యకామణులారా, నవయవ్వన భరితలై శుక్లపక్ష చంద్రునిమాడ్కి- నానాటికభివృద్ధినొందుచు నెల్లరనుమీగోమునా మోదింపఁజేయుచున్నారు. మీకుదగ్గ ఎకిమీండ్లను గూర్చిన గదా కెంపుకు కుందనమేసినట్లు శోభించు? రాచకన్యలగుటచే స్వయంవర సాం ప్రదాయంబు మనకుగ్గుతోడబుట్టినది గాన మీారుకోరెడి వలపు కాండ్ల వర్ణింయన నాయువతీసిరోమణులు లజ్జనభినయించి పెద్దదియయగు మృదువాణి మొదట మందలించిన తామిరువురు తమవన్నె కాని వర్ణింప సమ్మతించిరి.

మృదువాణి తనపతి గుణమెట్టిదయినను, ధనవంతుడుగను, రూపవంతుడుగను, నుండిన జాలుననియు, పురుషుని తనచాకచక్యంబున వశపరచుకొన గలిగినట్లును చెప్పెను.

కోకిలాలప, "నేవలచువన్నెకాడు ధీరుడుగను,శూరుడుగను,శాంతదాంతాది గుణశీలుండుగను, నుండవలయు. గుణములేని కులశీలంబులేల కాల్పనా? రూపరేఖలు భూపతులకనావశ్యంబు,అని ప్రత్యుత్తరమిచ్చెను.

ఇట్లు వీరుసరస సల్లాపంబులాడుచుండ, నేపథ్యంబున డాగి వినుచున్న విక్రమసేనుడామందిరము ప్రవేశించెను.అంత నాకన్యకామణులు లజ్జావేశపరవశులై, తమగుట్టె వరుబయులు బెట్టుదురోయని పలాయనపరాయణులయిరి. రాజు, తన తనయుల మనోభీష్టంబునకు సంతసించి,

సుబుద్ధిరాక నారాకాసుధాకరవదన కెరింగింప, నాపె, తనతనయ లిదివర కెరుంగించినదంతయు, లవముదప్పకనుడివి, కోకిలాలప కోరిన గుణగణంబులు పేరవర్త తనయుడగు మదనమోహానుని యంద చొప్పెత్తినట్లున్నవనియు, అతడు రూపంబున వసంత జయంతులధిక్క రించుననియు, యోగనిష్ఠాగరిష్ఠంబున శుకయోగి సముడనియు, పౌరు షంబున సవ్యసాచి నపహాసించుననియు,ఇన్నియుండియు నిహాసుఖాపేక్ష లేక,రాజ్యమందాశవదలి, జనపదంబులబాసి, ఆభీలకంటకసైకతప్రదే శంబుల, నాకలములదిని, తదేకధ్యానంబున, నిర్గుణ,నిర్వికల్ప, నిరామ యుండగు నాపరమేష్ఠినెవ్వేళ తనహృదయకమలంబున నిడుకొని, యా మహానుభావుని సుందరముఖారవిందసందర్శనంబెన్నడునాకుగల్గెడినో, సాలోక్యసామీప్యసాయుజ్య పదవులెన్నడబ్బునో, యని చింతించెడిసీ స్త్రబ్యునికి, చెరుకువిల్కానికఱకుకోలలకు దాళక, శుకపికశారికాదినికర సకలఖగకులంబుల కలవలంబులకు కలకలపడి, షట్పదులొండొంటిపై యనురాగముచే మకరందంబులచూపి తత్పానంబు నొండొంటికి కుడి పించుట కాంచజాలక, మరాళంబుల పిరాళిచేఁజేల్పెడి యంచలయం చున నుండనీక, తలిరుబోండ్లు తలిరులశయ్యల నిదురంటక పొరలుచు, పంచశరుని ధాకకోర్వక, యాకాక నుపశమింప, గంధంబును బూసి కొని, వాని వెడికోర్వక వీచెడి గంధవహుని కుచేష్టచేయకుమని వేడి కొని, మదనానలంబున పొరలెడి ఈయువతుల దెప్పడామదనమోహా నుడు తముజేరి యామదనబారినుండి దప్పించునోయని హృదయంబున కుళ్ళి లజ్జచే వెలిబడకున్నవారు శుకవాణివానిపై వలపుహెచ్చునట్లు వర్ణించి మనతనయలమనంబా మదనమోహానునిపై పొరలించె. యీ మదనమోహానుడన్ననో పట్టినపట్టువదలక వివాహామువలదనుచున్నట్లు తోచెడిని. ఇట్టిసంచర్భముననీయువతీమణుల కాయన పొందెటు పొసగు

నన," నాభూకాంతుండిట్లనియె. "మృదువాణి పల్కిన పల్కుల నేనెరుంగుదు. దాని సాహసము పరికించుట కిదియె తరి. అక్కచెలియండ్రిద్దరు నొక్కరినే కోరినట్లున్నది. ఇంతకు వీరవర్మ సామంతరాజగుటచే మన కనుకూలుడుగనుండు" నన రాజ్ఞి యందులకు సమ్మతింప, లగ్నపత్రిక వీరవర్మకంపిరి. శుకవాణియు నీశుభవార్త తన జననికిఁ దెల్పి నిజపురికరిగెను.

---

## 3-వ అధ్యాయము.

తన తండ్రి వచ్చిన తరిఁ బరుగిడిన మృదువాణి, వీరి మాటల బొంచి వినుచుండినది గాన, తనతలిదండ్రులు లగ్నపత్రిక వీరవర్మకంప నిశ్చయించినది యంతయు నెరింగి, ఇద్దరాండ్రు కలిసి యొద్దికతో నుండ నగునా, యని చింతించుచు, తలిదండ్రులమాట లాబోటికిఁ గర్ణకఠోరంబులై తోప, దాపులేక, తన సోదరిపై కినుక నాపజాలక, నేకతంబ నిటు చింతింపఁ దొడంగె.

" నాసోదరి యెన్నడును నాకపకృతిఁ జేసి యెరుంగదు. చీమ చిటుక్కుమన్నంత బాధ నాకు గలిగిన లోకమే మునిగిన ట్లెంచి, వేసిన రాతికెల్ల బారుచు, మంత్ర, తంత్రౌషధంబులచే నాబాధఁ దొలగింపఁ జేసి కన్నకడుపుకన్న నెక్కువగ వగచుచుండును. ఆపె నిష్పక్షపాతినై యున్నదున్నట్లు పలుకుచనవరతము నాక్షేమము నరయుచుండును. అట్టిదానిని కట్టడినై సట్టడవిని నిట్టనిలువునఁ దలగొట్టింప నెట్టులగు?— కాకున్న— నా కాకాంతామణి కంటెనెరసు గదా? అకటా యీధర్మ సంకటంబు నెటు బాపుకొందు? బాపకున్న నాయాపద లెట్లు తొలగు? ఏకగర్భవాసులమైయుండి, ఒక స్తన్యంబు గుడిచి, ఒకరియుచ్ఛిష్టంబు నొకరు దిని, అన నలవిగాని యనురాగముతో నొండొరుల నరనిమిష

మైన బౌయఁజాలక, క్రేవులకై దిరుగు గోవులమాడ్కి యుంటిమి. అక్కటా! నాదురదృష్టమునకు దగినట్టి పాపి జనకు డిద్దరిని నొక పతి కేలగూర్పనెంచె? కోకిలాలపకోర్కె లన్నియు నీ భూపాలునియందు దప్ప మరేరియందైన గాంచు టరుదు. ఇంతటి సుందరాంగుని గూడు భాగ్యము నాయట్టిహంతలకేల యబ్బు? అబ్బకున్న నే నిలనుండ గల నా? కార్యసాధకు లిట్టికొతుకుల నుంచుకొనరాదు. కుంతీతనయులు కర్ణుని వధియింపరే? కైక రాముని కానన కంపదే? సుగ్రీవుఁడు వాలిని వధియింపఁజేయఁడే? క్షత్రియవంశజాతనై, క్షాత్రతనూనక నీర్ష్య నములు కేల? నాసోదరి నాప్రాణకంటకముగా నున్నది. కుట్టెడి తేలు నంటనిత్తురా? కుటిలఫణిన్వధియింపకుందురే? ఎవ్వ రెరుంగకుండ దీని నొక కిరాతునిచే వధియింపఁజేసెద నని నిశ్చయించి యొక చేటిని బిలచి యచ్చోటికి చేరువనున్న కిరాతుని బిలపించి వానితో నిటువక్కా ణించెను.

ఓరి, మీరందరు చతుస్సముద్రపరివృతా ఖండలభూమండలము నేలెడిమత్పితను మీతండ్రిగాభావింపరే? ఏలిక కెవ్వడేని ద్రోహంబు జే యునా? అతని కెట్టికష్టము లెట్టియాపద లెట్టిసంకటములుగలిగినను అవి మీకు సంభవించినట్లెంచి తద్బాధలదొలగింపచూచుట మీపని గాదే? అయిన నారాజుబిడ్డ మీకు సోదరిగాదే? చెలియలికష్టము చూడగోరెదవా! యన నాకిరాతుడు, తల్లీ నీవు నాచెలియలితో స మానమనుటనసంశయంబు. నిను నొప్పించిన వాడెంత మేటిబంటయి నను వానినే కాటికంపకమానను. ఇందుకింత వగపేల' యన, నాయిం తివానికి మారాడకుండ వ్రేట్టుబెట్టిఇటుపల్కె.

ఓరీ, నిజమాడెదవినుము సవతిపోరుసై సుటకన్న జచ్చుటమేలు. పలుసుమములలో నొక్కదానిభ్రమించి దానిపై వాలెడిభ్రమరము

వలె పురుషుడు తన మనస్సున కెక్కు మానినిని, మహిషిగాగొని, తక్కిన వారికడ, తేరిచూడక యుండును. పతియనవరతముపరకాంతలతో పొరలాడుచున్న చూచుటెట్లు? రతికేళి దేలింపని పతినిగల సతి బ్రతికిన నేమి? జచ్చిన నేమి? పతిపల్కరింపకున్న సుతు డెటుకల్గు? సంసారసాగరంబును తరింపజేయుధీరుడు సుతుడుగదా? అర్భకులు లేని నిర్భాగ్యురాలి కీవనము లెందుకు భవనము లెందుకు జీవనము లెందుకు కాల్పనా, చూచినవ స్తువులయూనని వేచుచు, పోయెడు దారికడ్డంబుగబరుగిడుచు, నిద్రించుచున్నవద్ద జేరి అమ్మఅమ్మయని కమ్మనిమాటలబిలచుచు, పలుకకున్న పైబడి తన్ని, కన్నులపంట వొనరించు చిన్నిసుతుని కాంచు భాగ్యము నాకెటులబ్బు.

విధివ్రాయుటయసత్యము. మజ్జనకునివ్రాతయే నిజమన్నట్లు మాయక్క చెలియండ్రడ నిరువుర నుక్కనికి గూర్చనెంచిన, నిక ముందుకోకిలాలప నాకనుకూలవతిగనుండునా? ఆత్మసుఖము నెవ రపేక్షింపరు? పురుషుని వశపరచుకొన్న నన్నెవరు పల్కరింతురు. ఇక కోకిలాలపమునికి నాకపాయకరము గాకుండునా? నాకు సవతిపోరుదప్పించిన నింత ఘదంతలు ద్రవ్యము నిచ్చెద, నని తన కంఠహారమును వాని మెడనిడెను.

ఆకిరాతుడు పోతుటీగెకైన జన సలంఘ్యమగు నీనగరపువాకిట ప్రవేశించినదిమొద లిదివరకు చెప్పినదంతయు విని, పురవీధి నిరుగడలించుకేని నిధానింపక జరుగు వాణిజ్యమును, పుష్పరవీథిని దాటి చన్న మేడలజాడలను, అందుపైన నిలుచుండి వీణానాదంబున కనుగుణంబుగ కంకణక్వణములదన్వి నొందించు సుందర సుందరీముఖల యందంబులను, జాజి, సంపెగ, కేతకాద్యనేకపుష్పాదులయొక్క పరిమళమును, రథతురగాదివాహనారోహులైన జను సేవకులను, యావీథికభిముఖంబుగ

నున్న కోటనీటును, దాని నలుదిక్కుల పరివేష్టించి రెప్పవేయకఁ దిరుగు రక్షకభటులను, భటులపైనుండు రథిక, అతిరథిక, మహారథికాద్యనేక శూరులను గాచియుండ, నట, భట, గాయకాద్యనేకులు వుచితస్థలంబులనుండి బొగడుచు, భేరి, మర్దళాది ధ్వనులు చెలుంగ యంతిపురము వైపునుండి బయల్పడు సచివ దండనాయకుల వైభవంబులను వినోదార్థమై యుంచిన శుక, పిక, శారికాద్యనేక పక్షులకు పాఠంబు నేర్పు బాలికలను, చిత్తరువు బొమ్మలుగల స్తంభంబులను, గోడలయం దమర్చిన నిలువుటద్దంబులను, తమంతట విసరుచున్న పెక్కువింజామరములను, వట్టివేళ్ల పందిళ్లను, నగరున పరచియుండు చిత్రదుకూలములను, హంసతూలికతల్పంబులను, వీటిని సన్నింట నమర్చియుంచుటకై యుండు దాసీజనంబులను, అడుగునకు మడుగులిడు అతివెలును, కనుసన్న మెలంగు కాంతలును, కంటికిరెప్పవలె కాచుకావలికాండ్లను తలంచుకొని ఏటుపోయిన నద్దమునుండి ఎదురెక్కువచ్చు మనుష్యును చూచి మతిచెడి, అంతకు పదంతలై యుగపడు నస్తుసమూహమున కచ్చెరువొంది, సాటాడిన మరల పలుకు పలుకురాలవిని భ్రాంతినొంది ఇట్లనియె.

“తల్లీ! ఈనగరు జేరవలయునన్న రాజవీధినే తెంచి, కోటకావలివారి దప్పించుకొని, తలవాకిటి భటులబారిబడక, లోనుండు రక్షకభటుల లక్ష్యపెట్టక, దాసీజనంబులకు కాసిచ్చి లోపరచుకొని, రాజునకును రాజ్ఞకిని తెలియక నొకచోరునివలె ప్రవేసించవలెను, లేదేని నెవ్వడైన తెగవేయకమానడు.

మాయొడయుని, కన్నతండ్రికన్న నెక్కువగనెంచి యాయన క్షేమంబునకై మాప్రాణంబుల నొప్పింప నాయత్తపడియుందుము. స్వామిద్రోహమునకు చేతులాడునే? తమకును కోకిలాలపయు మా

యొడయని కొకటియేగదా? కోకిలాలప మృతినొందిన మాతండ్రి కడుపుకాలదా? దీనిని మాతల్లి భరింపగలదా? నీతోబుట్టువుగదా? అట్టి చెలియలిని సంపాదింప నీతరమా? ఇది నీకు దెలియనిదికాదు? మాతండ్రిని మాతండ్రిగ భావించినచో చెలియలని జంపచేతులాడునే? అబలను జంపుట పౌరుషమే? లోకమునందు పురుషులు లేరైరే? నీకు తగినపురుషుడు జిక్కడే. చక్రవర్తితోడ సంబంధముజేయనేరేని వెనుదీతురే? కోకిలాలపను జంపనసాధ్యము. ఆపెనెందేని గొనిపోవుటకీ బిచ్చుకత్తుల కావలిదప్పించుకొనగచ్చుకూతలుకూసి పోనగునా? నేనెక్కడైన నేదేని యొకమిషచే దప్పించుకొందును. కోకిలాలపను తోడ్కొనిపోనగునా? ఆపె నావెంటవచ్చునా, నీపాదమాన నేనీపనిదప్ప మరెద్దియైన జేసెదనన, మృదువాణి కండ్లెర్రచేసి గ్రుడ్లు పెకలించి బొమలు గంటువేసి వాకిట కడ్డంబుగ నిలుచుకొని పాలుద్రావెడి పిల్లలగొంతుల దెగవేసెడి కటికకుగూడ కనికరమా? భయమా? నీవంతటి భీరుడవైన ఈభవనము నిపుడెటు జొచ్చితివి? కోడలు విధవకాలయును, కొడుకు మని యుండవలయునన్నట్లు ద్రవ్యముమాత్రమువలయును, కార్యసాధనమాత్ర మనుకూలింపదు గాబోలు. నేటిరాత్రి నా దాసీజనంబునెల్లరను నేదోయొక కారణంబున నంపెద. నీవీకవాటము వెనుక డాగి యుండుము. నాచెలియలికి మత్తుమందిడి మూర్ఛనొందింపజేసెద. దిడ్డి వాకిట రక్షకభటులుండరు. ఆద్వారంబున నాచెలియలి నెత్తికొని పోయి వధించి ఆపె కనుగ్రుడ్ల నానవాలుగ దేవలయు. ఇందులకు సమ్మతించిన నింతపదంతలు ద్రవ్యము నొసంగెద. లేనిచో ఇప్పుడే కేకవేసి రక్షకభటులకప్పగించెద. నీవిటనుండి దప్పించుకొన్నను దండనాయకునిచే నిను దెప్పించి మరణశిక్షయ కప్పగించెద. నీవేల యోచించెదవు. స్వధర్మము జేయుటచే పాపమెప్పటికిని లభింపదు. యుద్ధమున పలు

యోధుల జంపిన ధీరునకు వీరస్వర్గమబ్బునను నదెరుంగవే? నీవీపని జేసి నాచే నొసంగబడు బహుమతిని పరిగ్రహించిన నాయనుగ్రహమునకు పాత్రుడగుటయేగాక నీవును నీబంధువర్గమును అనేక వత్సరంబులు సుఖజీవనము జేతురు. నాకు పతిభిక్ష యొసంగిన పుణ్యమనాయాసముగ లభించును. దీనికి యోచింపకు మననాకటికి ద్రవ్యాశచే మోసపడి, యాకంఠహారమును తనసతికొసంగి మెప్పించవచ్చునని సంతసించి ఇటు దండనాధిపతిచే జచ్చుటకన్న పరోపకారంబునకు ప్రాణంబుల గ్రోల్పోవుటమేలనియెంచి యబలను జంపను తెంపులేక, "ముందుబో యినబావి, వెనుకడుగిడిన జెరువునున్నట్లు స్త్రీహత్యఁజేయునని చెప్పుటకు మున్నె, ఆత్మహత్యనైన జేసికొనవలయు, లేదా, వెలుపలి భృత్యుల పాల్బడి మృత్యుదేవత పెండ్లాడవలయు.

రాకన్నియ లిరువురు నొకటియేగదా? అట్లయిన నొకరి సుఖంబునకుమరొకరిని జంపజనునే? నాప్రాణములు దక్కించుకొనుట కీమాటలకొడంబడియెద నని నిశ్చయించి మృదువాణి మాటలకు సమ్మతించి తనమందిరమున కరిగెను. నాటిరాత్రి మృదువాణి తనశయ్యాసదనమందొకపాత్రను పాలనించి దానిలో మత్తుమందు గల్పి మఱి యొకదానియందు మంచిపాలనుంచి దాసీజనముల పెక్కుపనుల పనిచి చెలియలిరాకకై వేచియుండ కోకిలాలిప వాడుకప్రకార మా మందిరముజేరి చెల్లెలితోడిసరససల్లాపంబున గొంతసేపును వీణా గానంబున మరికొంతసేపును గాలక్షేపముచేసి, మృదువాణీ మనభాగ్య మేమందము? మనకోర్కె లెన్నడీడేరునో తెలియకున్నది. పుట్టిననాట నుండి తోడుబాయకుండిన మనకు మెట్టినిల్లుగూడ నొకటెయగు భాగ్యము చేకూరెగదా? ఆహా! నేవర్ణించిన వన్నెకాడు పట్టుపట్టి పరిణయంబు నొల్లననుచున్నవాడట. ఆతని వశపరచుకొన నీవు కంకణము గట్టి

యున్నావు. నీనుండి నాకోరినకోర్కె లీడేరునట్లున్నది. ఇట్టి చెలి
యలు పూర్వజన్మ పుణ్యవశంబున లభించినది. సఖీ నీవు నాపాలిటి
కల్పవృక్షమవుగావే? నీబోటి పెన్నిధిసన్నిధినున్న నాకేమికొరతయని పరి
పరివిధముల కొండాడుకొలది మృదువాణికి మనోవేదనమెండై కినుకను
వెలబడనీక మృదుమధుర భాషణంబుల నిట్లు వక్కాణింపదొడంగె.—

"అక్కా! మక్కువపడి నీవొక్కపురుషునిగోరినవానిని నీకుదక్కింప
లేకున్న నేకృతఘ్ననుగాకుందునే? ఆత్మస్తుతివలని ప్రయోజనంబేమి?
అన్నిటికిని దేశకాలపాత్రంబు లనుకూలంబుగ నుండవలయు. అందు
కై ఇదివరకువేచితి అని అటనున్న ఘటికాయంత్రముజూచి నడిరేయి
యగుట నెరింగి, ఇక కాలముసమీపించినది. అని చేరువనున్న మంచి
పాలను మృదువాణి త్రావ కోకిలాలపయు వాడుకచొప్పున వేరుపాత్ర
యందిడినపాల గ్రోలిగ్రోలకమున్నె క్షీరపాత్రంబున బడవైచియున్న
ఔషధప్రభావంబున, హాలహాలజ్వాలావళికన్న మిన్నైనబడబానలము
కంటె మితిమీరి, ముక్కంటికంటిమంటకంటె నెక్కువయగుమంటలో
కాల్చిన శలగింజవలె మృదువాణీ నాకేమొ అవాచ్యంబగుసంకటము
పుట్టినది. పాల,పాత్రంబునన్నుంచి మూతవేయమరచితివా? లేదేనితాం
బ్రపాత్రంబున పాలబితికియుందురా? గాకున్న నిట్టిపిత్తవికారమేల
గలుగు? నీపాలనుగ్రోలిగ్రోలకమున్నె, నాకవాచ్యంబగు సంకటంబు
జనించె. భోజనమజ్జనాదుల, పాచకదోషంబున నెద్దియేనియపాయము
గలిగియుండునా? మృదువాణి! ననుబాయకుము. నాకీలోకమే గిరగిర
దిరిగినట్లున్నది. సర్వాంగంబులు వడకదొడంగె. మేనిపసచెడె. గళమెం
డినోటతడియూర జిహ్వాలోపలబోవుచున్నది కర్ణాలయంబులులయమగు
చున్నవి. నరంబులన్నియు నీడ్చినట్లయ్యె. నోరుదెరవనశక్యమై కుత్తుకనె
ద్దియోయుంచినట్లు గొరగొరలాడుచు, నాలుకమందమైమాటలుతొడబడ

గుండెను పటకారలచేఁజికి కడుపునకయ్యెడితిప్పినట్లయి, పేగుల వెలిదోసి నట్లున్నది.” అని నోటనురుగుగార, తేలగండ్లువెచి, విలవిలతన్నుకొనుచు మృదువాణికంఠంబును తనకరయుగళంబులగట్టిగబట్టి మోమున మో ముఁజేర్చి అమ్మా నాకేమొరానురాను మరణవేదన మెండగుచున్నది. అక్కా నాకై పడ్డపాట్లన్నియు భగీరథప్రయత్నంబులై నీటగలియుచు న్నవే,యని బోరనియేడ్చుతరి నారంభోరుహ సర్వాంగంబులు నీట ముంచినట్లు చల్లబడ మృదువాణికొదవిన ఆత్మసంతోషమును వెలిబడ నీక,“ కోకిలాప నాకికదిక్కెవరు. కన్నకడుపుకన్న నెక్కువగ పెంచినదాను నొంటిమైవిడిచిచనజను నే? కాంతా మనబ్రతుకు కాకికోకిలచంగమా యెగా! అయ్యో గళ మెండుచున్నదే కొంతపాలైన ద్రావుమని పాల గాచుచో మరికొంతమత్తుమందాపాలను జారవైచి చల్లార్చుదానివలె చక్కగ కలిపి యాపాలను కోకిలాలపకు కుడిపింప, అనిలుడ నలునకు దోడ్పడ్డరీతి, కోకిలాలపకు వేదన మెండై జీవుాత్కృమణగునట్లు పడెడి సంకటమును మృదువాణికన్నులార గాంచుచుండెను.

కోకిలాలప తనకొదవిన సంకటముపై సజాలక దీనస్వరంబున. “ హరిహరీ నాకీదొసగుపొసగుననుట నాకుడికన్నదరుటచే సూచించు చుండియురానున్న యాపదను బాపలేనైతి. ఆపాపిపాల నేలగ్రోలితి. నొసటవ్రాసిన వ్రాతను తుడిచివేయనగునా ? ఈ సంకట మనుభవింప నెవరితరము ? జీవము వెడలిపోకున్నదే ? అయ్యో దావాగ్నిమధ్యముస పడవేసి వేచినట్లు నామేనుమండుచుండ నేనెటుభరింపనగు ? అని పొరలుచు మూర్ఛిల్లెను. అంత నామృదువాణి చిటుకువేయ నొకకరా తుడు తనచెలికానితోడ నేతెంచి మైమరచిపడియున్న నామదనుని దంతి నొకతల్పంబున వేసికొని యెద్దియు నగపడని యాకటిక చీకటిని, కటా! పంకేరుహనయన పాలిటి యమకింకరుల మాడ్కి నాయమనెత్తుకొని

ముందువెనుకైన చూడక దెబదెబదిడ్డి త్రోవను పరుగిడి యొక ఘోరాటవిఁజేరి, దారిజూపవాఁడీ ఘోరకృత్యంబుఁ జేయపనిలేదని మాటలాడుకొనుచు వాహకులై వెళ్ళుచుండ పులులెలుంగల ఎలుంగులును, కరికిటుల ఘీంకారరవంబులును గూబలగుగ్గూలును నతిభయంకరములై రోప శుక్రసందర్శనము లభింప నొకవనమధ్యంబున నావనరుహదళనయన నాబోయలుంచిరి. నిశాచరులకును, కుమిదునులకు ఖేదంబుగలిగె. కోకిలాలపఁ జంపగమకించినవారి మనంబులు భేదించె. చకోరాక్షికి గల్గినపాటునకు చక్రవాకంబులు చింతిల్లినట్లుండె. లోకంబులు తెల్లవారె. ఇట్టి పాపకృత్యంబును జేయసమకట్టు పాపులుగలరాయన్నట్లు నలుగెలంకుల కలకలంబులంతకంతకు మెండయ్యె. అనిమిషపతి తనముకురకపోలకై యుంచిన ముకరమోయన కమలాప్తుకరంబులా కమలాక్షిముఖంబుపై బారె. కోకిలలు మేల్కొలుపులుపాడ కోకిలాలప నిదురమేల్కాంచుచున్నదోయన మత్తుదిగి మత్తగజయానతిన్నగపొరలె.

ఆపెనటుగొనితెచ్చిన బోయలు, కనుగందనిమేను, మేనుదగ్గ సోయగముగల్గి, నిదురించుచుండియు, చిరునగవున గన్పట్టు బింబాధర కెంపు దంతంబులసొంపునకు నింపు హెచ్చింప, కరగిపోసిన పసిండిబొమ్మయోయన నాకాంచనాంగిమేనుతోడ వెలుంగుచుండ, నాపెనుజంప తెంపిరితనంబుజాలక కలహించుచున్న యాకటికెబోయె లాపె నిదుర లేవకమున్నె పనివినకున్న తమకు క్షేమంబుగనుండదనియెంచి, వారచ్చోటువదలి తిరిగిబోవుచో ఇసుక నెరపి ‘‘కోకిలాలప మనికి యొరుల చెవిబడ్డ నాపెయునికి కపాయకరముగనుండును. అసువులపై యాసయున్న విక్రమసేనుని రాజ్యములోకిబోక వేరుదేశంబున మారువేషంబున మనవలె’’ నని లిఖించి, మృగమునుజంపి, మృగాక్షినయనంబులని మృదువాణికొసంగిరి.

మృదువాణియు చెలియలిపీడ నేటితోఁదప్పూడ ఆయెననియు, సవతిపోరుండదనియు సంతసించి, తనసోదరి యొకవిటపురుషునితోఁడ పలాయనంబాయెనను వదంతిబుట్టించి, హాస్తిపురిపట్టపుదేవి కాఁగల నని నిశ్చయించి, ధర్మము తన్ను గాచుననియు ఒకరికిచెడుగుచేసిన తాను చెడుననియు ప్రేలుచుందురు. తమయనుకూలములను చూచుకొనక పరులమేలుగోరువారెంతటిబుద్ధివంతులు. ఒకరికపకృతియొనర్చిన పాప మట. దానిని పరలోకమున ననుభవింతుమట. ఒకరి కెరుపక తానెట్లు సుఖంపదగు? నోరెరుగని దూడలకడుపుఁగాల్చి క్షీరాదులచే మనపొట్టల బెంపమా? కోమలంబగు గుచ్ఛములగోయక వాటిపరిమళము నను భవింపనగునా? ఒకజీవినిజంపి మఱొకజీవి పెంపుగాంచుట గానమా? అశ్వమేధములట, శతక్రతువులట, వీటిచే నింద్రాదులకు తృప్తియట. వేయిగుఱ్ఱంబులను, నూరుమేకలజంపిన త్రిదశులు తన్వినొందుదురట. అది హింసగాకుండునే సకలజనోపయోగకరములును నిరపరాధులును నగు తిర్యక్కులనుజంపిన లేనిపాప మొకయబలను, తనకంతగాలమును జంపిన లభించునా? పాపము పట్టిచ్చునట. అదెట్లు? యుక్తాయుక్తము లెఱింగి దేశకాలపాత్రంబుల దెలిసి, ముందువెనుక లరసి యొనరించిన కార్యముకొనముట్టదా? కోకిలాలపను జంపించితికదా? అది బయలు పడెనా లోకులందరు నేబుట్టించినబూతుల నిజమనినమ్మి నాచెలియలు పరపురుషునితో పలాయనమాయెనని నమ్మరే? బుద్ధికేద్దియసాధ్యము. అందున స్త్రీజనము వడుగవలెనా? నేనామదనమోహానుని నదెట్లుపెం డ్లాడనోజూచెదనని నెమ్మదిగనుండెను.

కోకిలాలప ఇలువెడలి పోయెనను సంగతి వాయువేగ మనోవే గంబులకంటె నతిత్వరితగతి నెల్లదేశంబుల వ్యాపింప, ముగ్ధయగు నా ముద్దుగుమ్మ ఇట్టిపని కుద్యుక్తురాలగునాయని కొందరును, కంఠకావర

ము మెండయి యూరకుండనొల్ల కాయుండజయాన మిండలపాలాయె
నని మరికొందరును, అఖండభూమండల మేలి దుష్టుల దండింపజేయు
విక్రమసేనుని కులకుఠారమాయెనని మరికొందరును, పసిపాప యా
పాపము జేయనోపునా యనికొందరును, మృదువాణి సవతిపోరుసైప
నొల్లక యామధురాలపను జంపించి వట్టిమాయలాముద్దుపట్టికి గట్టియుం
డునని కొందరును, బిసరుహాక్షులచ్చటచ్చట గుసగుసలాడ దొడంగిరి.

ఈమాటలాశుకవాణి చెవిసోకగనె కసుగాయకొరకినట్లయి పస
చెడెనని వ్యసనపడి నిజమరయువరకు తనసోదరునివివాహము నిలుప
నెంచి మదనమోహానుని మంకుతనంబుకు చాలచింతించి, యాతని
ఆప్తమిత్రుండగు గుణనిధిని పిలపించి, మాయన్నను దారికి దెచ్చు
ధీరుడవీవె. అతను పరిణయంబు వలదన్న ఈవంశాంకుర మిక లేక
పోవును, ఎటులయిన వంశోద్ధారము జేయ కంకణముకట్టుకొమ్మని పలు
దెరంగుల బతిమాలుచుండ మదనమోహానుండు పరమవైరాగ్యతచే
పాపనాశకరుండగు శంకరుని సేవింప చేరువనున్న దారుణాటవికి పెందల
కడ వెళ్లెననియు, ఇతని దాయాదియగు శివవర్మవీని జీవసమితిగొన సమ
యము వేచియున్నాడనియు, సమాచారమందినతోడనే గుణనిధి తన
మిత్రరత్నసంరక్షణార్థమై వైళంబ యచ్చోటు బాసిచనెను. శుకవాణి
గుణనిధి తన్ను బాసిచనిన నాటనుండి ‹‹ నాయనుజుడుపట్టినపట్టు వదల
డనుట నెల్లరెరింగియు అవివేకినై యాతని పరిణయంబాడునటుల
జేయు మనిగుణనిధిని బతిమాలితి. ఆవలపుకాడు నను బాసిచనె? మదన
మోహానునికై కారడవులదిరిగి నిద్రాహారాదులకువెలియై మేనెంతవా
డునోగదా! చూచిన దృష్టి దాకునని కన్నార తేరి చూడనైతి. నాకీ
పాపిగ్గదేలగల్గె? పోవువానివలదననైతిని, మరికొంత సేపు మాటాడనైతి,
చనునతడు తిరిగివచ్చుతరియైన దెల్పడయ్యె, నాతలిదండ్రు లీతనిని

నాకు గూర్తురా? నేనేమని నామనస్సును వెలిబడనిత్తును. సోదరుని మంకుతనంబునకు యోచింతునా, నాతనికి గూర్పనెంచిన కాంతను గాంచనందునకు కుందుదునా, మాయన్న యసువులగొన నుద్యుక్తుడగు శివవర్మకై చింతింతునా, నను బాసిచన్నవల రేనికై వగతునా, గోటిచుట్టుమీద రోకలిపోటన్న ట్లీశుకము నేనాడుమాటలన్నిటిని మరల బలుకుచుండును. ఈశుకమైన నాకార్యమునకు తోడ్పడదు. అక్క-క్క-యని పెట్టినదెల్ల మెక్కి- ఇపుడు నన్నుపహసించుచున్నది. నేనిటనుండ చాలనని వగచుచుండె.



## 4-వ అధ్యాయము.

**కోకిలాలాప** నిదుర మేల్కాంచి కనువిప్పి నలుగెలంకుల కుడ్యంబులపైనుండు సుందర సుందరీమణులపటంబులకు బదులు తాల, హింతాల, నారికేళ, సాల, రసాల, సురసాల, తక్కోల, లవంగ జంబు, జంబీర, కదళి, దాడిమాద్యనేకవృక్షులతాదులను నగరంబుననున్న శుకపికశారికాదులకు ప్రత్యామ్నాయముగ లెక్క-కుమించిన పక్షికులంబులను, భేరి మృదంగ వీణానాదంబులకు బదులు షట్పదుల రవంబులును చూచి కలవలపడి నిదికలమైనదియు, నిజమగునదియు గాంచజాలక నలుగెలంకుల పరికించిచూచి, ఇందెవరు కొనితెచ్చినదియు దెలియక తత్తరపడి లేచి కూర్చొని, బిత్తరిచూపుల పరువిడి, నెటుబోవను దారిగానక డస్సి, యెట్టకేలకు తను గొనితెచ్చిన వారికాలిజాడ గనుగొని దానివెంట వెడలిన నొక జనపదంబుజేర నగునని యెంచి, కొంత దవ్వేగి, అటవారిలిఖిని జదువుకొని, ఇటు ఎలుగెత్తి ఏడ్వసాగును. "అకటా నేడెట్టిదుర్దినము! పుట్టిననాటనుండి ఇలు వెడలక, సూర్యరస్మినైన కనుగానక, విద్యుద్యుతికి వెరచుచు, పరపురుషునిమాట చెవిసోక

బరుగిడుచు, చీమ చిటుక్కుమన్న జంకుచు, నాయడుగులకు మడుగులిడి, నన్నుపచరించెడి పలు దాసీజన పరివేష్టితనై యెల్లవిషయంబుల నా తలితండ్రుల యుల్లంబు రంజిల్ల జేయుచుంటిని. అట్టిదానిని తలగొట్టింప జట్టిలనంపి నట్లందు వ్రాయబడినది. ఇదియేమి పిట్టపిడుగు? ఆపిట్టరాయని నెక్కునట్టి వేలుపైన నిట్టియపకృతి నెట్టులోర్చు! ఇది యెట్టి కాలవైపర్యము! మత్పితకోపమూనునంతటి పాప మేమి జేసితిని? భూపతీంద్రు లోపికచే న్యాయాన్యాయంబు లెరింగి దుష్టనిగ్రహ శిష్టపరిపాలన జేయవలయు గదా! శ్రీహరీ! కన్నవారైనను మన్నింపరైరి. కొన్నవారలో అంతటిభాగ్యము నాకెటులబ్బు? పూర్వజన్మకృతకర్మంబు నెవరు ననుభవింతురు? జనకా! నాయందలి తప్పొప్పుల రయక నీవిటులేలయొనర్తువు? మృదువాణీ! నాకై నీవుపడ్డపాటు బీటికి గాచిన వెన్నెల చందమాయెగా? సఖీమణులారా! నాయాశ వదలుడు, వృత్తులతాదులారా! మీదాపుబాసితిగదా? జననీ! నీకడుపు కాల్చి చనినందుకు నన్ననవలదు. అతినిడుదమై, అలంఘ్యంబగు కర్మపాశము లీడ్చుచుండ నేనేమి జేయుదు? తల్లీ! నాతప్పు నాయొడిగట్టె శిక్షకొట్టింప గూడదా? ఎటుచూచినను, శిహ్మ, శరభ, శార్దూలాది ఘోరమృగంబులును, గండభేరండాది చండభీకర ఖగకులంబులును, మెలంగుచున్నవి! దేనివి కడిగినగుదునో తెలియకున్నది. శుకపిక శారికాదులారా మిముఁ జేరదీయువారెవరు? సఖీమణులారా మీ సఖి నెటు పరిభవింతురే? కాంచనాంగీ నీకికకూతురెవరు? శంకరా, మృడా, గౌరీశా, ఉమాపతే రాగల జన్మమందైన నన్నామదనమోహానునికిఁ గూర్చుము. ఇంకెక్కడి శంకరుడు, ఎక్కడిమదనుడు? నన్నాతనికి గూర్చుటెక్కడ, దైవమొకడుగలడా? ఏడీ దీనను బ్రోవరాడాయెనే? అయ్యో పాపి చిరాయువన్నట్లు నాకుచావైన రాదాయె. ఈయరణ్యమున నోకెండు

చున్న దే. ప్రాణమైనఁ లేదాయె, జీవము వెడలదాయె, కట్టా! డప్పిచే నాదేహమంతయు నిప్పున వేచినట్లున్నది. జిహ్వాలోపలి కీడ్చుచున్నది" యని ప్రలాపించుచుండ వేటకై వచ్చిన వృకోదరుఁడను వ్యాధుఁడు మదనోన్మాదపరీత మానసుఁడై యచ్చోటు జేరి ఆ యిందుముఖి పొందుఁగోరి సదయత జూడ మని వేడ నాయింతి "పిడుగుబడ్డ వానికొరివితోఁ గాల్చినట్లేను పిపాసార్తినై పరితపించుచుండ నీ క్రూరుఁడు నను బెదరించెడి, నేనేమి జేతు. ఈశా! నను పరికింపనిది తెరియా? మానినికి మానము ప్రాణమే కదా? మానము గోల్పోవుటకన్న ప్రాణము విడచుట మేలు. గళమెండి నోరెగయుచున్నది. పిలచినపల్కువారేరు లేరు. నాకీ దురవస్థ దేలగలిగెనో? దెలియకున్నది. పలువుర చేతి పసినిమ్మలై మెలంగు నెందరో సుందరపూరుషుల తిరస్కరించి రోహిణి చంద్ర సమాగంబుకై వేచినట్లు మదనమోహనునికై లబ్ధనాశనైన నాయట్టి నిర్భాగ్యురాలి కింకేగతిగల్గు? వరదా, నన్నింకను తరిచి చూచెదవేల? నినుబోగడ నే నెంతటి దానను. నా మొరేల యాలకింపవు నీదర్శన మరుదయ్యె నేని మానరక్షణ మొనర్చుకొన వెరవైకటి జూపుము. అబలలపై చలమా యని పలుదెరగుల నా పరమేష్టిని వేడ భక్తవత్సలుండగు కరివరదుని నాకరియాన బలుతెరంగుల బల్కరింప, నాయార్తిధ్వనివిని, మదనమోహనుం డామదిరాక్షి జేరి, మూఢ! తుంటవిల్తుని పాశంబులదగుల్పడి మంటిబొమ్మలపై యాశపడనేల? ఈ దేహము బుద్బుదప్రాయము. చమురున్నమటుకు దేదీప్యమానంబుగ వెలింగెడి దీపకళికలభంగి, దేహమందు సురున్నమటుకు జీవికివ్యాపారేచ్ఛగలిగి, తత్సుకమున ననవరతము పంచేంద్రియమూలకముగ ననుభవించుచుండును. కామాంధులమై, మన్నుమిన్నెరుగక, అన్నుల మిన్నల చిన్నలకు మోసపడి, అస్థిరమగు నీతుచ్ఛసుఖంబుల కాశనొంది, ఆమిషము నాసించి గాలంబును మ్రింగిన మత్స్య

మునలె, పరిమళమునుగోరి చంపకముపై వాలిన షట్పదిభంగి, మురళీ గానవినోది యగు మురారిశయ్యమాడ్కి మృగతృష్ణమయం దాశచే మృతినొందు మృగంబులభాతి ఈఆశాపాశంబున నేలతగుల్పడియెదవు; పరస్త్రీసంగమును ప్రాణాంతకహేతువని యెఱుంగుము. తారాధిపుని తెఱంగెఱుంగవా? అనిమిషపతి ఐశ్వర్యభ్రష్టు డగుట దెలియదా? నహుషు డనేక వేలవత్సరంబులు పామై అరణ్యరోదనము జేయుటం జూడ వా! యోరీ, వత్సా, వదలుమీవనితను. అని యాకటికబోయను కుటిలాలకక్షేమంబునకై వేడ, ముందొచ్చెడి కీడునెఱుంగక తానాసతిపతియనియు, యూపెను వదల వీటిపడదనియు నాబోయ ప్రత్యుత్తరమిచ్చుచుండ, పొదలలోడాగియున్న శివవర్మ మదనమోహానునిపై నంపము నేయ నది రంపమువలె నబ్బోయ వక్షస్థలమును జీల్చివేసెను.

అంత నామదనమోహానుడు కోకిలాలపజూచి, కాంతా, పరమాత్మస్వరూపుడైననిజీవి, ఈనవద్వారగృహంబును బాసిచన పంచభూతంబులు స్వస్థానంబుం జేరుననుటకు వృకోదరుడు తార్కాణముమాగిన పండు నేలం బడకుండునే? కాలమురాక మున్నెదైన గాచునుగాని పోగాలమువచ్చుతరి బ్రోచువారెవరు లేరు. కాలచక్రముఘోరవేగముతో తిరుగుచుండ నిముషనిముషమునకు యశస్సెక్కుచు ఆయువు క్షీణించుచుండును. మన ఆయుఃపరిమితిలో కొంతకాలము బాల్య, యవ్వన, కౌమార,వార్థకదశలబోవ,మిగలోనర్థము సుషుమ్నావస్థ బోగొట్టుకొని రోగపీడల గొంతకాలము వెచ్చబెట్టెదము. మనకు మిగిలిన నీకొంతకాలమందైన నాపరమేష్టినిఁబూజించి కృతార్థులముగావలయు నేనెడలెద నన, మరునిపూల్బంతి నాదగునాయింతి, యూతని శుభలక్షణంబుల రాజవంశజుడుగా నెఱింగి, భూకాంతా, ఏకాంగినై దాపుగానక ఘోరారణ్యంబున పిపాసార్తినై పరితపించెడినను నొంటిమై విడజనునా? అ

హింసా పరమోధర్మమను వేదఘోష లరణ్యరోదనంబునకు సరిజేసి తివా? బ్రాపనీఁచ్చిన పాపములభించునా? యని మదనమోహానుడు తనక మండలములోని నీగుకకిలాలప కొనంగి డప్పి బాపి, యబలా నాకి కశలవ్రెసంగు మన నాయింతి నినునేకాదనను, హరిణాక్షులెక్కడ? అర ణ్యంబు లెక్కడ? దాపులేక దీనాలాపంబుజేసెడి నొకయబలను రక్షిం చుటకన్న వేరెద్దిముఖ్యము? జీవకారుణ్యమైనవలదా? నీవ్రుదప్ప నాకీ యరణ్యంబున నెవ్వరు శరణ్యంబు? నాయందనుగ్రహించి సన్మోక నగరసామీప్యంబునవిడచిన నీపేరుబెట్టుకొని బ్రతికెదనన నామదన మోహానుం డిట్లనియె.—

“జీవి తామెరపైని జలబిందువువలె, అడుసులోని కుమ్మరపురుగు మాడ్కి, మజ్జిగలోని వెన్నరీతి, జహ్వాపైని ఘృతంబుభాతి, ఇహసుఖం బులనంటియుంటక నుండవలయు. నీపూర్వజన్మపుణ్యవశంబున నీయర ణ్యంబు జేరితివి. ఇకనైన నీహేయమైనకాయమందాశవదలి కాయ మగు పరమపదవిని గోరనెంచుము. ముద్దరాలవగుట నామాటలింపు దోపవు. పరమేష్ఠిని గొల్చుచుండు” మనెను.

అంతనామదనునిదంతి నృపశార్దులా నాకేల నీశుద్ధవేదాంతము. పురికి పలుతెరవులున్నట్లు ముక్తిసాధకము లనేకములు. మీబోటివిజ్ఞు లపాదశేవా తత్పరనైయున్న నాకు మోక్షమబ్బదా? ఆత్మార్థమై తపం బుజేయువాడు రాక్షసుడగుననుట మీరెరుంగనదియా? దండకమండ లాదులూని, కాషాయవస్త్రధారి యగుటయే సన్యాసంబు గానోపునే? “పరోపకారార్థ మిదం శరీరం” అను వేదఘోష లేమాయె? నాయట్టి వనితను ఏగపింప మక్కువబుట్టెనా?

శ్రీహరి లోకసంరక్షణార్థమై దశావతారంబులెత్తి దుష్టులమొ త్తడే. జటావల్కలధారియై, వ్రతోపవాసములమేను సుష్కింపజేయు

టకన్న సాంసారిక కృత్యంబుల జరుపుచు, నీనులపోషింప సద్గతియ బృధా ? తపంబొనర్చుట తప్పనను, పంచేంద్రియంబుల స్వాధీనపర చుకొని చిత్తవైకల్యమించుకేని గలుగనీకుండుట నాతరమా ? జనకునికి సద్గతిజిక్కదే శబరియుచ్ఛిష్టంబున శ్రీరాముడు సంతసింపడే ? మిూబో టివారల పాదసేవాతత్పరనై యున్న పాపములభించునా ? పరమేష్ఠిని గొల్చుచుండమంటిరి ? అతడెట్టివాడగునదియు ఎందుండునదియు నెరుంగకెటు పూజింతు ? ఎంతటిపాపియైనను ఆర్తజనశరణ్యుండును, ఆశ్రితజనకల్పభూజుండును, దీనపోషకుండును, దయాళుండును, మానినీమానరక్షకుండును నగు నాపక్షివాహనుని, యాప్రహ్లాదవరదుని నెంచి నంతట సకలకష్టములు దూరమై ఇష్టార్థములు లభించుననుటకు నిదర్శనముగ ఎటుపోవను దారిలేక, ఘోరకంటకసైకతపలలోపేతంబై, శింహ, శరభ, శార్దూల, వరాహ, భల్లుకాద్యనేక ఘోరమృగనిబిడితంబైన నీయరణ్యంబున నోటతడియార నీరిచ్చువారైన లేక, హీనమానవుని చేచిక్కి ఃరితపించుచుండ నీవిటుజేరి మానరక్షణయొనర్చి ప్రాణదాన మొసంగితివి. నీకన్నదైవము గలదే ? నన్నొక జనపదంబు జేర్చుమని పలువిధముల బతిమాల యాసతికి మారాడలేక యుచ్చెలిని తనతల్లికప్పగించి మదనమోహానుడు నిజేచ్ఛంజనియె, అట కోకిలాలవ నయిరంధ్రి యనుపేర నారాజమహిషి కింపుగ సకలపనులు నిర్వహించి ఆపెమనస్సు కెక్కినదగుటచే నాపెను సేవకవృత్తినుండి తొలగించి తన నెచ్చలిగ జేసికొని గృహకృత్యరహస్యంబు లన్నిటిని నయిరంధ్రికి దెలుపుచు ప్రస్తాపవశంబున నొక్కనాడు తనసుతుడగు మదనమోహానుని మంకుతనంబును అతనికి కోకిలాలవం గూర్చవలెనని తనకున్న పేరాసయు, కోకిలాలవపై బుట్టియుండు అపవాదమునులవము దప్పకుండనుడివెను.

ఐదవ అధ్యాయము

5-వ అధ్యాయము

అంత నామరునిమేల్బంతియగు కోకిలాలప స్వా[redacted]దన రాని వ్యసనమును భీతియు పొంగిపొరల దానిని వెలిబడనీక ఏకతంబ ఒకకుటీరంబు జేరి ఇట్లు ప్రలాపించుచుండె.

"తగిలినకాలే తగులును, నొగిలినకొంపే నొగులున నుటకిదిచాల దా? ఏపాపమెరుంగనినాపై, నాపాపి పితరుడవాచ్యంబగు నిందారోపణ జేసియున్నాడు. అందుచే నాకుమానహానియు, నాతనికి కులహాని యునగుననికూడ ఎరుంగడయ్యె. ఈపాపివార్తగట్టె నెవరుపాల్పడిరో తెలియకున్నది. మృదువాణి మహాత్మ్యమైయుండునా? సోదరీ, సవతిమత్సరంబు జక్కగ జూపితిగదే? మేడిపూతను, కోడిపాలనుగాంచినను గాంచవచ్చును; నీటమత్స్యంబుల జాడనెరుంగవచ్చునుగాని, నారుల హృదయమెరుంగ నెవరితరము? ఆ నాడరణ్యంబున నాతోమాటాడిన యామేటి పురుషుడీబోటిసుతుడట, మదనమోహానుడట! ఆహా అతని రూపంబునకును, ఇటనాచే జిక్కినసీపటంబునకును హస్తిమశకంబుల కున్నంతభేదమగపడెడి. అతను బారికంతగ్గ జిక్కకున్న నితనిబారికి జిక్కితి, వీనికేడక్కితి, మదనా! సంతతమందహాసవికాసితవదనా! నీయంకపాళిమెలంగు భాగ్యమే శశాంకవదనకుగలదో దెలియకున్నది. ఏమీ, నేకులహీననా? కాదుగదా? నాచక్కదనము నీమదనమోహానుని యక్క యెరుంగకున్నదే పెంపుడుచిలుకను పిల్లికిపట్టిచ్చినట్లు నాకులుకు తళుకులజూచి పలుకరించువారు లేక నాయవ్వనంబును రెండవబంధిఖానంబనదగు నీగాఢాంధకారంబు పాలుజేయ నాఫాలంబున వ్రాసియుండ,యాభూపాలుండబ్బు టెట్లు?అబ్బకున్న నేనెటునిబ్బరింతు? యేదబ్బరక త్తె తన గబ్బిగుబ్బలనాతని కరయుగళంబులనబ్బింపజేసికొని, పండు

వెన్నెలలెల్లెడనిండుకొన, దండిప్రవాహంబులిరుగడల బారుచుండ అ [illegible] ఖారవిందంబులనుండి వెలిపడు పలుసరసోక్తుల స్వారస్యంబున కనుగుణంబుగ గందవహ్యంపు మందమారుతంబులవీవ ముసిముసినవ్వుల నిసుకదిబ్బలపై శయ్యాటలకయ్యంబులాడుచెరిబారు పై యెదపై టసవరించుకొనునంతటిభాగ్యమునాకెటులబ్బు; దిబ్బపై పరుండి మేడపై నిదురించినరీతి గలకన్నట్లు దాస్యవృత్తినున్న నన్నెవగుపల్కరింతురు? గులకరాలలోని వజ్రంబగపడునే? అయ్యోగంధంబుదీసి నాకరంబు కాయలుగాసె. నాయవ్వనంబంతయు నీవనితాశిరోమణి సేవకావృత్తిని దారబోయవలసె. కటా! తలలేనిశరీరముబోలె, వ్రాతలేనిపత్రంబువలె భటులులేనికోటరీతి యింతికితగు భూకాంతుడులేని జవ్వనమున్ననేమి! లేకున్ననేమి? ఈభూకాంతుని నాకు గూర్పమాతండ్రియగు విక్రమశేనుడెంచియుండెను. దీని నెవరెఱుంగుదురు? హరిహరీ! నాగుట్టుబయలు పడరాదు. నాకులస్థలంబులదెలిపిన నాయసువులు నిలువవనియందు వ్రాయబడియుండెను ఖండలపాలై తివట, నిజమెవరెఱుంగుదురు? యుక్తవయస్సున పెండ్లాడకున్నందుకు కాని వారిట్టివట్టిమాటను బుట్టించినను రట్టుబెట్టిరి. పదుగురాడుమాట పాటింపకుండునా న్యాయము బయలగువరకు నాకీనింద తప్పదుగదా? నాకుల గోత్రంబులనేనె దెలుపుకొన్న, "అకళంకవై యున్ననీప్రచ్ఛన్నవేషంబున జనకునిబాసి హీనసేవజేయుట కేల సమ్మతించితి" వని యడుగరే? పూర్వజన్మమందు దంపతుల నెడబాపి తమకుగలిగిన వియోగమునకై పరితపించుచుండ సంతసించుచున్న ఫలము నాకిపుడులభించినది. చక్రవర్తి కడుపు జెడబుట్టి ఆతనికపకృతి దెచ్చిన నన్నెవరు సన్మానింతురు? శెబయలుపడ్డ స్థానభ్రష్టత్వమైనదిగాక లోకులు కాకులమూకలవలె బొడుతురు? ప్రాణహానియు సంభవింపవచ్చును. ఆత్మహత్యచేసికొన్నను యీయపకృతివమా

నదు. నాసుకృతమువలన నీరాజ్ఞి నాకనుకూలవతిగనున్నది. ఆపెనహాయ
ముచే నిజమరసినాయుపకృతి తొలగించుకొనవలయును ఒకరిదాసిగా
నుండుట కష్టమనుట నాకిపుడు దెలిసె. నిద్రాహారములుమాని
యజమానురాలి యంతరంగమూహించి ముఖచిహ్నలచే నెరింగి, అన్నిటికి
ని మోటుకొని, ఉస్సురని యూపిరివిడుటకయినగూర్చుండక, అనవరతము
పనిజేసియు ఒక్కనాడు కార్యనిర్వాహకమున కొంతతడవైన, ఇన్ని
నాళ్లు జేసినదంతయు మన్నుగలయును. దాసియుమగువకాదే! దానికి
కష్టసుఖంబులును అర్తిజూర్తులును లేవే. ఐశ్వర్యమను అంధకారమున
దీనిని దెలిసికొనలేరు. ఆహా! ఇట్టిదిగదాస్థానబలిమి కాసారంబున
కరినివేధించు మకరిస్సైకతంబున శునకముచే భంగపడునట్లుఖండభూ
మండలంబేలెడి మత్పితకృపాకటాక్షవీణాకై ఇట్టి వారెందరోవేచుచుం
డ, నాతని యండబాసినందున, నేనీయండజయాన కనుసన్నను కాచి
యుండవలసె. ఎద్దియయినను మానెనాయనుంగుసంగాతిని కన్నార
గాంచువ్రన్నె మున్నదో లేదో దెలియకున్నది. ఈ దాస్యవృత్తినున్న న
న్నెవరెరుంగుదురు. నాకీమదనమోహనుని మాటకలలోని మాటాయె
గా! అద్దంపుపెట్టెలో నణగినధనముబోలె నిద్ధరాధిపుడు నాకులభ్యంబుగా
కున్నవాడు. నేనెవరితో మొరలిడ్డ నేమిప్రయోజనము. కట్టా, కఠిన
కిరాతునివలె నామదనుడీపటంబున నిశ్చేష్టితుడై యున్నవాడు. నీతని
వదనము నాహృదయంబున కంటగట్టినట్లున్నదని దుఃఖించుచుండ
పెండలకడ మాతృసేవకై వచ్చుచున్న మదనమోహనుడు యామొర
విని యీరాజన్యాని యవ్వనికై యిటువదరెడినో తెలియకున్నది. మదన
మోహనుండను వాడెవడై యుండును? పటమునందలి రూపమట,
ఆకుటీరమందొకపటమున్నది. ఆపటమునందు నారూపులిఖయింపబడ్డది,
ఆసతియారూపమును వర్ణించుచుండునా? నాతోనిదివరకె జంకకమా

టాడిన యీాపం కేరుహానయన తనయాంతరంగంబు నెరింగింపం నేల వెను దీయును? భోగులుజోగుల కూటమి నేలకోరెదరు? నాకేల ఈయోచన? అసతి యేవన్నా కానికోరి భంగపడి మనసుకలసినచోట మనువన్నట్లు వగచుచున్నదో ఆపికంటికెవడు వసంతజయంతులధిఃకరించునట్లగపడునో, వానిని మదనమోహానుడనియు, భూలోకమారుడనియువర్ణించును. ఎముకలేనిజిహ్వ వేయివిధములన్నట్లు కామజ్వరంబునకోరిన యట్లుపదరుచుందురు. కాలవిళంబమయిన తనంతయు తనంతట బయలుపడుననుకొని నిజేచ్ఛందన కుటీరంబునకుం జన తండ్రియగు వీరవర్మ యచటికేతెంచి, తనయా, నీవు రాజ్యమేలకున్నను మానె నేకోరెడి కోర్కెలలో నొక్కటినైన నీడేర్ప జేయవేయని బతిమాల జనకా పరిణయం బొడుమనునదితప్ప మరేద్దియైన జేసెదనని మదనమోహానుండు ప్రత్యుత్తరమిచ్చెను.

వీరవర్మ కెద్దియాడుటకును నోరాడక విసుగుజనించి తనసుతుని పరుషవాక్యతకు పరితపించి నావంశము నీతో తుదముట్టునను గుట్టెరుంగనైతిని. ఈశ్వరేచ్ఛకెన రేమి జేతురు. నీవువలదన్నదానినే నపేక్షింపను. భూపతులు వార్ధత్తమునీడేర్పకుండుటఅనుచితంబు నీవు పెండ్లాడకున్నను మానె నాకు పౌత్రునిజూపిన జాలునన మదనమోహానుడు తండ్రీ, ఇది అసాధ్యమని తెలిసియు నన్నిటులేల తొందరపెట్టెదరు? దయచేసి మన్నింపుడని బతిమాలెను. వీరవర్మయు దుర్భరంబగు వ్యసనమున నచ్చోటు బాసిచనెను. ఈయువరాజు కోకిలాప్రపలాపమును విని అకాంతనాకై కుందుచుండునా? కుందిననేమి? కల్మషమగు నీమాంసపుముద్దపై యాశయేల? అ ఇంతికిదగుమాటను చెప్పినస్వార్గమున కెవరుదెత్తురు? సుఖదుఃఖంబు లనుభవించుటకై జన్మమెత్తినను, ఈనిమిష సుఖమందాశచే, మలమూత్రాదుల పుట్టినిల్లగు నీశరీరసుఖమునుకోరి,సఖలసుఖ

మునకు వునికిపట్టగు నా మోక్షపదవికి దూరమగు టెట్లు? నేనిహసుఖంబు లకు వెలియైన పూర్వజన్మార్జితకర్మ నెవరనుభవింతురు? కుబేరు నంతటి ధనికుడైనను చేసినఋణము దీర్పకుండనగునే? శాపపీడితుడైన విష్ణువు కృష్ణావతారంబున నొకకిరాతునిచే చావడే? అతడేల యంతటి దుర్మ రణము నొందవలసె, చేసినకర్మ మనుభవింపక మానదని సూచించుటకు గదా? మనయింటనుండు నైరంధ్రి నాకై వగలగుందుచున్నది. పరోప కారము ప్రథమధర్మముగదా? అయిన వనితను పెండ్లాడి సంసారసాగ రంబున నీది, లేనివ్యధల దెచ్చుకొనవలయునా? కటికలకు గోవునుపట్టి చ్చినట్లీభూకాంతను పరరాజులపాలు జేసి, పలువురనిందకు పాత్రుడ నగుటెట్లు? ఐహికసుఖంబులమునిగి వ్యవహారిక ధర్మంబున కాలంబును వ్యర్థబుచ్చిన, నే కడతేరుటెట్లు." అని విచారపడుచుండ భారతియు వానిని బలుతెరంగుల వేడెనుగాని మదనమోహనుండావేడికోలను పెడ చెవినిబెట్ట నాయింతి, తనయా! సంసారసాగరంబును తరింపజేయ భార్యయనునావయు, పుత్రుడను నౌకాధిపతియు నుండవలయు. ఆయో డలేనిచో పున్నరకంబను సుళ్ళలోమునిగి తేలుచుండవలసి వచ్చునుగాన మముతరింపజేయవే; వంశాంతకకాలమే తెంచినందునను, నేనునీతల్లి నగుటచేతను మనసువిప్పి నీబోటియుక్తవయస్కులతోనుడువరానినీప్ర సక్తి జేయ తెంపుజేసితిని. ఇది నీకుదెలియనిదికాదు. నాకుదోచినకొలది తెలియజెప్పి నా వంశాంకురము నిలుపుకొన నుడివెడి నుడువులుగాన సావధానుడవై వినుము. వృక్షతాదులందును, పశుపక్ష్యాదితిర్యగ్జంతు వులయందును సతిపతులిష్టసుఖము లనుభవించుచున్నవి. బ్రహ్మ పిపీ లికాపర్యంతము కాముకులు తమభామలతో కాముకేళులనాడి బాము లను మరచియుందురు. ఇదిగదా రాజయోగము. వ్యాసుడుగూడ పాండురాజును బుట్టింపడా? నందనందనుండలి వేణులతో కలసిమెలసి

యుండదే? ఇంతవేల మనకులగురవగు వసిష్ఠుడు నూర్గురసుతులను గాంచడే? వారికి మోక్షమబ్బకపోయెనే? తనయావృద్ధుల మన్నాళ్లు మనియుందుము? ఏకపుత్రవిషయమైయుండియుఁ బరిణయం బొడకుండిన మా వంశాంకురమెట్లునిల్చు? యని నిట్టూర్పువిడుచుచుండ శుకవాణి అన్నా చిన్నదానిమాట అని త్రోసివేయకుము. వదినెలేని వనితబ్రతుకు పదును లేని బాకును అనుమనవి త్తని లేని భూమియుగాదే? సాక త్తిల్లు పుట్టినిల్లును నడపువారెవరు? అతివలక మ్మగారింటనుండుటకన్న సుఖం బున్నదే? అట్లైన నీయింట నను బల్కరించువారెవరు? నీకష్టసుఖం బుల కెవరగుదురు? తెప్పలాడునట్లునీళ్ళున్న కప్పలుచేరినట్లు ద్రవ్యము న్నమట్టుకే భృత్యామాత్యవర్గము నిను పరివేష్టించియుండును. భార్య అట్లుగాదుగదా! ఒదవిన సుఖదుఃఖంబుల భరించుటచేగదా ఇల్లాలికి భార్యయను పేరు గలిగెను! అఖిలదుఃఖరోగంబులకు భార్య సిద్ధౌషధం బుగాదే? అనాదిగా మనవంశీకులు జనులనుండి ద్రవ్యాకర్షణజేసి వారి నిసుఖపెట్టి తాము సౌఖ్యముగనుండిరి. నీవు పెండ్లాడనిచో నట్టిజనుల గతి పుట్టినశిశువును పులినోటికిచ్చుటగాదె? రాజ్యకాంత పరభూకాం తల పాలగునుగదా? ఇది రాజనియతియా? నియతిదప్పుట ధర్మమా? ఎంతటి దుష్టాత్ముని నైన భరింతు పంతంబుదప్పిడి పలువనేనొల్లనని భూ దేవి మొరలిడునట. మనతండ్రి, ప్రజల, తనబిడ్డలవలె పాలించుచుండ నట్టివారి నెవరిపాలుజేయ నెంచితివి? అని పలువిధముల బతిమాలెను.



## ౬-వ అధ్యాయము.

మదనమోహనునకు నైరంద్రి తలపోతలను, తనతలిదండ్రులాడిన కఠినోక్తులను చెలియలికా శుకోలనుతలంచుకొలది పూర్ణిమిసాయాహ్నాం

బున సముద్రతరంగంబులమాడ్కి మనంబున నంతకంతకుఁ గలకలం బులు హెచ్చివచ్చిన చిత్రరత్నముకడనైనఁ జూడక తలనువంచుకొని బోటవ్రేల నేల రాచుచు కూర్చొనియుండెను. దీనిని గుణనిధి కాంచి మంచిసమయంబని యెంచి ఇటువచించెను. సఖా! సకలధర్మంబు లెఱింగిన నీకు నాబోటివారలు తెలుపవలసిన దేదియు లేదు. అయిన నీమాత్రపుత్రా ధులుగూడ నెఱుంగని యొకవింత నొకయింతి యందుజూచి అపస్వాంత మంతయు నరసితిని. మనయింట సైరంధ్రీవ్రతము సలిపెడి సిరీషను నాప దెక్కడనో యొక్కపతమును సేకరించుకొని దానినిపలు తెరంగుల వర్ణించుచు, నందులిఖియింపఁబడ్డ స్త్రీప్రతిమను జూచి నీపొందుకై యా కుందరదన కుందుట నేనేమందును! యాయిందువదన దుఃఖపెట్టిదని తెలియఁబల్క సేమాహింకైన నలవికాదు. ఆపెనడవడికలను, ఆచారశీల ములను గుణగణంబులను తరిచిచూడ నొక సద్వంశజాతగా గన్పట్టు చున్నదని మాటాడుతరి సమయోచితంబుగ సైరంధ్రియు క్రేగం టజూచుచు దెబదెబ వెడలుట తటస్థించెను. అత్తరి యావాల్కంటి కంటఁగారెడి కంకణముల దుడుచుకొనగమకింప దనచేతికంకణము నేలబడ తనయునుంగు జవగాపైనున్న యనుకంపంబు చేతను పర పురుషులజూచుట చేగల్గినకంపంబు చేతను లజ్జావనతముఖియై పరుగిడెను.

గుణనిధి యాభూకాంతుని కడకా శ్రీకాంతు నింతి ధిక్కరించు మరునిదంతివలయంబును దెచ్చి వలసినట్లు వర్ణింప, మదనమోహనుం డాకడియమునుజూడ నపేక్షింప "నెచ్చెలుడా యాసుందరాంగి మేన నున్న కడియమును నీచేతనుండుట నెవరైన నెఱింగిన లోకదూషణపాలగు దువు. సన్యాసులకు సఖీమణులసొమ్ము లేల? నీకును మనసుచలించెనా? ఇదియొక యచ్చెరువా? ఆహారనిద్రాదులవిడచి, జనపదంబులబాసి, నొప్పిడప్పులకోర్చి, ఎండగాలులకుమంచి, తపంబొనరించిన విశ్వామిత్ర

పరాశరప్రభుతులే ఇంతులకై చింతిల్ల నిన్నేస్మునకు? ఏలయోచించెదవు. ఇందులతప్పేమి? పరిణయంబాడిననేమి? రాజ్యమేలిననేమి? నీ జపతపంబులు జరుగవా? వంశోద్ధారముచే పుణ్యములభింపదా! మనుష్యయత్నంబున నొక్కటియు జరుగదు. గొడ్డలికాధారముగనుండు కఱ్ఱవలె కారణభూతు డొక్కడున్న జరుగవలసినదంతయు తనంతటజరుగును. కర్త కెవడు వెలియగును? ఇపుడాకంకణమును జూడగోరితివి? ఆఇచ్ఛ నీకెవడుపుట్టించె? సకలమెరింగియు మమకారము నేలవదలవు. నే పెండ్లాడననుటదేమి? పడతులలోమాత్రము జీవాత్ముడు లేడా? అందరికిని పరమాత్ముడొకటియేగదా? అని యాడుకొలది మదనమోహానునికి కలవలంబు హెచ్చి ఇంతులచేజిక్కి కంతుమాయకులోబడమంటివా? నీచేనున్నకడియమునే నాచేడి యాపెకు నేనలంకరించినను నాకట్టిచంచలము జనింపదు? ఈర్ష్యచేతన తపంబుదారబోసి మారుసృష్టిచేయనే గాధిపట్టినిగాను, గోపతిపైకినుకచే కాంతామణిని గోల్పోవు గౌతముడగాను పరకాంతనుగోరి ప్రాణంబుగోల్పోవ పాపికీచకుడగాను నాకెప్పటికి నట్టిమతిభ్రమ జనింపదు; వలయునన్న నాకినలయపాణికరంబున నీయాభరణంబు నుంచెదనన నటుచేయు గుణనిధి యాతనిపురికొల్పెను. పల్లవపాణికరంబును మదనమోహానుం డా కడియమును నుంచెను. బిత్తరిచూపుల తత్తరిపడు యక్కమలాక్షి కన్నీరు మున్నీరై పార ఇక్షుశరాసనహతిఁజేపారెడి యసిఘాతారుధిరప్రవాహంబుమాడ్కి గన్పట్టె. యావంకేరువానయున బింకముచెడి గడగడవడకదొడంగ నాబింబాధరమోము కేతకీపుష్పంబుమాడ్కి తెల్లబారె, మదనమోహానునకా కులుకువగలాడిమాటలు జ్ఞప్తికి వచ్చుకొలది మదనుడు ములుకులతో వేసినట్లయ్యె. కాంతను పరిణయంబాడ భూకాంతున కిచ్ఛజనించె. ఇందిరేశునిపై

ధ్యాన మిందీవరాక్షిపై మరలె. మదనపిశాచము మదనమోహానున కావాహమాయెను. జపతపంబులుసున్నాయె. మదనునియోగమంతయు మంటగలసి సైరంధ్రిసంయోగమునకై చింతింపవలసె. ఈరాజయోగికి భోగములపై నాశబుట్ట సామజయానసరసకై చింతిల్లవలసె. సన్యాసంబు సమూలంబుగా నాశించి, రాజ్యాపేక్షయను నాశాంకుర ముతలచూపె. ఇటులంతకంతకు యువరాజునకు వాంఛహెచ్చి తనగుట్టు బయలుపడునని తన్వీమణిసివదలి మోహానుడు తనమందిరము జేరెను. గుణశేఖరుండా మదనమోహానిజూచి యాకాంతను పెండ్లాడమని పలువిధంబుల బతిమాల నెచ్చెలుడానను పెండ్లాడమననేల. అందేమిసుఖము. నాస్వాంతము నీవెరుంగవే? రాజ్యమేలుటకును పెండ్లికిని సంబంధమించుకేనిఁగలదా? బ్రహ్మచారి రాజ్యపాలనీ మొనరింపగూడదా, నాయనంతరమా? ఒకనిని స్వీకారము జేసికొనియెదను. లేదా శివవర్మకు రాజ్యమేలవలయునను పేరాసయున్నట్లున్నది. వాడు పరుడుగాడుగదా? నాపినతండ్రిపుత్రుడేకదా? నావంశజుడుకాడా? ఇంతయునెరింగి తెలియనివానివలె పలికెదవేల? నాచెలియలికొకసుతుడుజనించిన వానిని సింహాసనాసీనుఁజేయగూడదా? “ యన గుణనిధి నిర్భరంబగు దుఃఖంబున,” సఖానినునేకాదనను. నీకై కుందు తలిదండ్రుల డెందమానందింప జేయుమా? వనితామణికడ కరుణించుమా? సఖునిమాట త్రోసివేసెదవే? తనకులేనిరాజ్యమున్న నేమి. పాడయిననేమి? నీవుపెండ్లాడి పదుగురిలోని పసినిమ్మవైన నాకును సకలజనంబులకును సంతసమొదవెడి నేను సానతినిచేరి సకలసుఖంబుల ననుభవించుచుండినిన్ని దారుణాటవిపాలుజేసి పగవానికిపట్టముగట్టిన నాకాం. తనను నమ్మునా? పరభూకాంతలు సైయందురా! సైరంధ్రినీకై వగచుచుండ పాషాణమైన గరుగకుండునే? ఆ ఇంతికలలందుగూడ నిన్నేకలు

వరించుచుండు. అయ్యో సైరంధ్రీ సకలసుఖంబులకు వెలియై కోమల కాయంబును శుష్కింపజేసి,స్నానపానాధులైన జేయక కఠిన నేలలపరుండి జడలుదాల్చి జడదారివృత్తినున్నను ఈమదనమోహానుని మదికరుగదయ్యె: ఇదియేటిధర్మము, యేమినియతి. అయ్యో చాంద్రాయనమెక్కడ చంద్రవదనయెక్కడ. ఈతనిబెండ్లాడకున్న నీవెట్లుబ్రతుకగలవు. ఈ రాజు నిను పెండ్లాడడను వార్తనీజీవిని బడవేయుట ఆకారణముగ నిను కుందింపజేయుటయేగాక నీవు గుండెచెదరి ప్రాణమువిడిచిన స్త్రీహత్య నెడిగట్టుకొనుటగదా అని ప్రలాపింప మదనమోహానుడు గుణనిధినోదార్చి తాను పెండ్లాడసమ్మతించినసంగతి పరమరహాస్యముగనుంచిన నాపైన పరిణయంబాడ సమ్మతించెను. మదనమోహానుడు పెండ్లాడసమ్మతించెనుసంగతి వీరవర్మకు గుణనిధి దెలుపవిక్రమసేనుని తనయను తనళ్ళుషగాగొన సమ్మతించినట్లు శుభపత్రికనంపి యంపకముమపే మృదువాణి బంధువర్గ సపరివార ఇష్టజన భృత్యామాత్యసమేతముగ హాస్తిపురి జేరెను.

గుణనిధి తనమిత్రరత్నము కోకిలాలపకై వగచుచున్నట్లును, నాపెను పెండ్లాడసమ్మతించినట్లును నొకజాబును మదనమోహానునిచేలిఖియింపజేసి తానొక పుష్పగుచ్ఛములోకట్టి యిట్టిగుచ్ఛము మరియొకటి మదనమోహానునకు కావలెనని నొకదాసిచే గుణనిధియంప కోకిలాలప దానిని చదువుకొని సంతసించి యొక నాంకేతికస్థలముజేరి తమ వివాహామునకై ముందుజరుగవలసిన విషయము లేర్పాటుచేసుకొనునట్లుబదులువ్రాసెను మనసుకలసినచోట మనువన్నట్లు మదనమోహానునకీదాసీవృత్తినున్న మదనునిములికిని వదలి మరొకరిని గోరనిచ్ఛబుట్టమి యాతనిమనస్సు పాదరసమువలె వ్రేరలుచుండెను.

---

## 7-వ అధ్యాయము.

వివాహముహూర్తము నానాటికి వెనుకకుబోవ దొడంగ మృదువాణికి యోచనమెండయియూరకుండ నొల్లక, కారణమరయవలయుననికోరి, మదనమోహానుని జేరి యాతనికెదుర్పడి తనవలలో వేసికొన నుద్యమించి భారతితోఁ గలసిమెలసి తిరుగుచో రతినిధీకరించు తన చెలియలటమనియుండుట నెరింగి, ఏకాంతంబున నాకాంత జేరి విక్రమ శేన భూకాంతుడు చాలవ్యాకులతఁబడి కోకిలాలప గన్పడ్డ తలగొట్టింపకున్నాడనియు ప్రాణంబులపై యాసయున్న పరుగిడుట మంచిదనియు, చిన్ననాటినుండి తనకు సహకారిగానున్న తనచెలియలితో కలసిమెలసియుండు పున్నెమాయన్నుల మిన్నకులేకపోయెననియు కొంచెము సేపు పిల్లికిజ్వరమువచ్చినట్లు శుష్కోపచారంబులు చేయ, నాకోకిలాలప నిజమనినమ్మి యూరికిచేరువనున్న నొకయుద్యానవనముఁ జేరనెంచి యొకజాబు లిఖియించి మదనమోహానునిజోబిలోబడవైచి చిన్నగజారెను. దీనినంతయు కనిపెట్టియున్న గూఢచారు లీజాబునెత్తికొనిపోయి మృదువాణికొసంగిరి. అది యాపత్రమునువిప్పి, నాప్రాణపదకమా, ప్రాణంబులు గోలుపోవుతరి ప్రాణరక్షణమొనర్చి పాపికిరాతుని బాధమాన్పి, ఓపికచేసి తల్లిదాపుజూపి, అన ఘలవిగాని, మదనానలంబున క్రుంగెడి నన్ను సదయతఁజూచి, నానోచిననోములు ఫలించెనోయన నెన్నోచిన్నెలచూపిన నావన్నెకాని, సన్ననినడుమువాని నామన్నెదొరమేటిని, ఉన్నమన్నట్లు విడిచిపోవుతరి యానన్నమయినది. నేటిసాయాహ్నంబు నూరివెలుపటనుండు సుందరవనమధ్యమున నుండెడి చంద్రకాంతవేదికపైన 8 ఘంటలవేళకు ననుజూడనగును. అపుడు తెలుపవలసినదంతయు మనవిజేసెద. అటుమీరు రానిచో—.

ఇట్లు,

తమపాదసేవకురాలు,

అభాగ్యవతి.

ఈజాబును మృదువాణి చదివి అందులో 8 ఘంటలను సంఖ్యను 6 ఘంటలుగాదిద్ది అచటనేయుంచునట్లుచేసి "గొడ్డలెంత వాడిగానున్నను దానికియొకకఱ్ఱతునక లేక దేనినేని నరుకనేర్చునా, ఆమదనమోహనునికై కోకిలాప పడుపాటునుజూచితే! బుద్ధిమంతులట్టిపనిచేయుదురా? జాబునులిఖించి జోబిలోవేతురా! నాయుక్తికొలది దానిని దెప్పించి యందులవ్రాతను తారుమారుజేసితి. ఇదెవరెరుంగుదురు. కోకిలాలపలుకన్న మున్నె నియమిత స్థలంబుజేరి యామదనమోహన కెదురయ్యెడ. వనితనువల్లనను వెకలుగలరే! యాధీరుడు నన్నేల స్వీకరింపడు? వలదన్న వేరుయోచనలు లేవే! పరపురుషునితో మాటలాడుటెట్లు? నామనస్సును అపహరించినవాడు పరుడగునా? దేహమాత్రనిస్వాధీనపరచి, మానమే అతనికిగోల్పోవనాయత్తపడి, చిత్తమాత్రనియందు నిల్పతిగదా అతడితరుడగునే? నేనాతని నేలపల్కరింపగూడదు! అతనాపేక్షితుని కన్నమిడిన వలదనునే? నేనిటుసంశయంపనేలనని తిన్నగ తరలెను.

మదనమోహనుడాజాబును జదివి గుండెఝల్లుమన,

తనుబాసి చనునంతటి కీడేమిచూడెనో యని కలవలపడి ఈ కాంతనను బాసి చనునని కలనైన నెంచియుంటినే! దానినెవడేమనెను కదా? లేకున్న నింతటి యుట్టిపాటుబుట్టునా? తనగుట్టువరైన బయలుబెట్టిరో? లేకున్న వీరవర్మయాగతంబునకు గతంబేమి? నేపరిణయంబాడసమ్మతించితినను సంగతి గుణనిధిదప్ప మరెవ్వరెరుంగరు ఆతడీదాసిని పరిణయంబాడసున్నానని మజ్జనని కెరింగింప యాపె యీపాపమొడిగట్టుకొని నాకనుపాపను, నాజీవితేశ్వరియగు సైరంధ్రిని చెనకియుండునా గుణనిధి యిట్టిపనులెప్పటికైన జేయుననుట నమ్మదగ్గదా! లేక వీరవర్మను తలీపతిని బెండ్లాడకున్నానను టెరింగి యేదేని యొకబాధ నీసైరంధ్రికి బెట్టియుందురా! ఒకనిమిషమొక యుగమువలె దోచుచున్నదే నాసతి

నిభాసి నేనీయింటనుండవలయు నాయనిచింతించుచుండ మురళీనాదవాం ఛచే గోవులుపరువెత్తగా గోపాలురు గోవులగుమిగూర్చిరి. అరుణాశ్వం బులపరదిశఁజేరెను. సముద్రుడు రుద్రుడై విషరాశితరంగంబుల వెద జల్లదొడంగె. మార్తాండు నికరకరకరంబులవేడియారె. సంధ్యారాగచం ద్రాంశుజాలంబులునిండుకొనియె. పక్షపాతంబున బరువెత్తుపక్షులఁజూ చుకొలది రాజున కిక్షుశరబాధమెండయ్యె. వీనినివంచింప మృదువాణికి వాంచబుట్టి నియమితకాలంబునకుమున్నె చంద్రకాంతవేదికపై సుం దరాంగిచేరి స్మరసాయకఘాకకోర్వక, మదనమోహానుని రాకకై వేచి సర్వసంచార ప్రచారంబునగలిగెడి యాకులగలగలలనువిని తనవాం ఛతీడేరునని సంతసించుచు సర్వంబుల సరసరలకు మదనదర్పమణంగె నని యుప్పొంగ్భూరుచు తనవలపుకానికై కలకంఠి వేచియుండెను.

మదనమోహనుడా జాబునుచూచిన తరినుండి యామదగజ యానకై చింతించుచు, దైవమా నేనేల నీసంకటమును తెచ్చుకొంటిని. త్రికాలంబుల త్రిదశశేవాతత్పరుడనై, ఇహసుఖములయందాశింపక, కోటకొత్తలంబులను,నాడు, మేడలను, వీడువాడలను,ధనవాహనంబుల ను, అక్కచెల్లెండ్లను బాసి ఆకలముల కందమూలంబుల దని,ఏకుందునె రుంగని,నాకకుందరదనగంటుబడి,కంతుసుఖంబుల వాంఛజనింపజేసి ఏం తోదురాశగల్గించి, తనకులుకు తళకులనెడి చెరుకు విల్కాని కరకుకోలల నేసితనవీక్షణాంచలముల నావక్షస్థలంబున నాటజేసి, మోమునందం బుననాడెందంబుకుందిచి సుధారససరసోక్తుల నాకు లేనివ్యధబుట్టించి త నయధరామృత మధుపానంబునిచ్చి పచ్చవిల్తుని కేళిదేల్చెదనని దురాశ గల్గించిన యామచ్చకంటిరూపము నాకంటికచ్చొత్తినట్లున్నది. యాగు ఛ్ఛస్తని మచ్చుజల్లి మాయమయినట్లయ్యె. ఇందు లేదాయె. పిలచినపలు

కదాయె. ఎందు వెదకిన కానరాదాయె. నడిసీట చెయివిడిచినట్లాకస్మికముగ సన్యాసించనె. "ఆకస్మికముగ నిను బాసి 'ఉన్నదున్నట్లు విడిచిపోవ్వ తరియాసన్నమాయె" అని వ్రాయబడ్డది. కండ్లెంత చెడ్డవి! ఆచాన నడబెడంగును, ఆసరసీరుహనయన సారస్యమును కులుకుపలుకులను నడబెడంగును జూచి యెట్టిదుష్టుడెట్టి కష్టముగలిగించనో తెలియకున్నది. ఎట్టియాపద, లెట్టిసంకటములు కలిగిన నోర్వవచ్చును గాని తనునమ్మి అతనుబారినుండి తప్పించిన మందయానసుందరము ఖారవిందంబును జూడక డెందమిటునిల్వనగును? దైవమా భూమ్యాకాశము లేక మైనిలచి నను దాళవచ్చును. ఉక్కుస్తంభంబుల మెక్కినను మెక్కవచ్చును. అంపశయ్యపైఁ బరుండి పెంపు గాంచవచ్చును. చలచల కాగు దేనియందైనను బొరలవచ్చును గాని యా చంపకగంధిని గాంచక ప్రాణంబులనిల్ప నిలింపపతికైన నలవియగునా? నాసుందరీమణి నను బాసిచనెగదా? భామలతోడి మాటలు పాములతోడి యాటలగునని నొకనాడును నెంచనైతి. న్యాయిందువదన మందయానంబును జూడవలెనను నభిలాషచే నానఖి దాపు జేర సూదంటు రాయి నూదిని లాగినట్లు నా మనంబు నన్నీడ్చుచున్నది. ఆహా, అచేతనంబులొండొంటిని విరాళి నాకర్షించుచుండ మంచి చెడుగులరయ నెరింగి షడ్రసోపేతంబగు మృష్టాన్నంబు భుజించి, పంచేంద్రియసుఖంబుల ననుభవింపజాలిన నీమానవశరీరము, పంచశరధాక కోర్చునే? ఆయంచయానను జూతమన్న కమలాపుత్రకరంబులు నీటగ్గలయకున్నవే? కువలయారీ! కన్నకూతురికోరిన కమలజుషును కపటనాటక సూత్రధారియగు కంతుపితయు త్రిపురాంతకుండగు త్రిశూలధారియు నొక్కడొక్కడే పెక్కండ్రనేచ, మూడు మూర్తుల రూపుడైన నిన్ననేల? ఒకనాడొకచో నిలువనీక కుంటిసారథ్యంబున

దేశమెల్లెదిప్పుచున్నను మేంటిబంటనని యందరనేలనే చెడవు? యని కుందుచుండ వారాంగనలు వాకిటనిలువ దొడంగిరి. కుముదప్రియుండు ప్రాఙ్ముఖంబునఁ గన్పట్టె. దీపకళికలు దేదీప్యమానంబులై లెక్కకుమించిన ప్రభాకరపటలంబు మాడ్కి దోచె. గాయకులు దీపికారాగాలాపంబుఁ జేసిరి. గోపాలురు క్రేవులకు బాలుకుడిపించిరి. అంత నామదనమోహనుడు తురగగతిని ధిక్కరించి, వాయువేగంబునకన్న వేయంతలధికమై, మనోవేగంబును గేలిఁజేసెడి తీవ్రగతి, సాంకేతిక స్థలముజేరి యచ్చటి శిలావేదికపైనున్నవనితలను గోకిలాలపయనుగొని యాలింగన సుఖంబుననుభవించుచుండ, వ్యాఘ్రచర్మముతో దిరిగిన గార్ధభము వాగ్దోషముచే చెడినట్లు మృదువాణి తనకితనియందు గలవలపును దెలుపనెంచి మోహపరవశతనాడిన మాటలచే, నీపెనన్యకాంతగా నెరింగి తిరస్కారపురస్సరంబుగా పరమచాండాలీ! పాపీ ఏమిసాహసమే—లోకకంటకీ! యేమిమాయదారితనమే! ఘాతకి అబలలను మాటనడవిపాలు జేసితిగదే! ఈసృష్టనపత్రంబును సృజింపనెన్నినాళ్లుగ నెంచియుంటివే! సైరంధ్రి నేమిజేసితివి! నిజమరయువరకు నిన్వదలు వాడనుగాను. ఉన్నదున్నట్లుబల్కి నీయునువుల దక్కించుకొనుము లేనిచో నీపలలంబును పలాసిపాలు జేసెద. హేచపలాక్షీ పలాయనంబుగా నెంచెదవా?" యని కరవాలంబు నెత్తనా మృదువాణి స్వామీ,నీపైనుండు హెచ్చుమచ్చికచే,నీప్రాణసఖి వ్రాసిన పత్రంబుననుండు కాలంబును మాత్రము దిద్దితిని నీకౌంగిట మెలంగ నెంచి విరాళిబాళిమైనిటుజేసిన ముగ్ధనునీట ముంచెదవో పాలముంచెదవో దేనికిని సమ్మతమేయని కన్నీరుమున్నీరై పారబోరని యేడ్చెను.

మదనమోహనుడు స్త్రీహత్యజేయ నోపక నాపెను వదలి తన ప్రాణసఖియగు కోకిలాలపరాకకై వేచుకొలది సుమశరుశిలివిమ మా

స్త్రంబుల కాకకోర్వక యారాకాసుధాకర రాకకై వేచుచు పాపి మారుని కోపాగ్నిని వీచి విజృంభింపఁజేయనేతెంచిన గంధవహునితో డ్బడ్డ యానిశాచరుని నిటుతిట్టఁదొడంగె:—

ఓరీ, చంద్ర! పాలకులము నేల పాలు జేసితివి. ఇందిరసోదరునకి దితగునా? కత్తికి పదిమూరొప్పులైన కాయంబున మిత్తిపాలుగాక మనితివి. పెనుబాము వాకడినైతివి. ఇట్టిబాములపాలుగాకుండమని నందన కదాజట్టివైనను కష్టంబులపాలు జేసితివి? ఓరీ గురుద్రోహికామించిన తారనువిడచిపలుతారల పొందొనర్చితివి? ఆచేతనంబులనైన ద్రిప్పవచ్చునుగాని విషరాశోద్భవుడగు నినుసన్మార్గమున కెవరుదేనోపుదురు? రారాజునకిది దగునా? మృగాంకా ఒకపాపము నెరుంగని నాకొద వినసంకటమును సైపజాలక పాషాణమయ్యు నీ చంద్రకాంత కన్నీరువదలుచున్నది. అని ప్రలాపించుచుండ రారాజురాకకై వెదజల్లన సుమములోయన నంబరమార్గంబున తారకలుగనపట్టె. సుమసాయక బాధహెచ్చె. కొక్కొరోకోయని జాముకోళ్లు గూసె. కామినీకాముకుల లొండొరులకు కుక్కుటంబులికోయని జూపినట్లుండె. మండూకంబులదండిరవంబు లీవధూవరులకు గల్గిన సంతాపంబును సూచింపు ఆర్తరవంబు మాడ్కిగనపట్టె.

## 8-వ అధ్యాయము.

కోకిలాలపమార్గమందొక శిలావేదికగాంచి అదియెనియామిక స్తలమనియెంచి నలుగెలంకులగాంచి తన వలపుకాని రామికిటుల చింతింపదొడంగె॥ మగవారలమాట నీళ్లమూటనుట నాకిపుడు తెలిసె. నాడామన్నెదొరమేటితిన్నగ నాకరగ్రహణంబు జేసి హస్తకడియము నలంకరించుతరినా కన్నీటిన్గాంచి ననుసదయత జూతునని పల్కె? కార్యసాధనకై

వసుదేవునంతటి వాడు గాడిదె కాళ్ళఁబట్టఁడే? అతని మాటలపొంకము, నేనేమందు? నాస్వాంతమును గరగించునంతటి పలుకులెన్నెన్నోఁ బల్కెఁ. అనుదినము ననుఁగాంచక నిద్రరాదనుచుండె. అతని పలుకులనమ్మి నను బెండ్లాడుననియెంచి యాతని యంకపాళి మెలిగి సిగ్గుచెడి తనపైయున్న ప్రేమను దెల్పుకొంటిని. అతఁడో నాటక సూత్రధారునిబలె నెన్నో ప్రేమంపు పల్కులఁబల్కి నాతోడ సరససల్లాపంబులాడి, నాదేహంబు స్వాధీన పరచుకొని నిక్కనిజముగ బెండ్లాడనున్నట్లభినయించుచు కాలముగడపుచుండె. ఇపుడెదపై రాతినెత్తినట్లు నాసోదరిని—మృదువాణిని బెలిపించినట్లున్నది. మోహనాంగుఁడామెను పరిణయంబాడునని లోకప్రసిద్ధంబుగ వదంతిగలదు. ఆ పెరూపమందు నను ధిక్కరించును. భూపతీంద్రుని పుత్రియగుటచే నన్వదలి యామెను బెండ్లాడకుండునా? యాతనిమనస్సిట్టిదని యెఱుంగ నేనాహీనకైన నలవియగునే? ఈతఁడు తన గుట్టును వెలిబడనీక బూటకసన్యాసంబు నభినయించుచున్నాఁడు. నేఁడేలకో యిదివరకురాకనున్నాఁడు. పురుషులు పలువుర పరిణయంబాడ నగునట భుజబలాదులయందు వడఁతులతో నెవరుతులదూఁగుదురు. బుద్ధిబలంబునకు సరస్వతిచాలదా. భుజబలంబునకు ప్రమీలయు తారయు లేరే? ఇట్లుండియు అది యేలకో నామనస్సు నీరసంబై చలచలఁగాఁగు తైలములోని జలబిందువువలె పొరలుచున్నది. ఆహా నేనిక యెట్లు? ఇలు వెడలుతరి నాకాసంగతిఁ జెప్పనందునకు నాపై నింతకినుకయేల? సంతత మందహాస వికాసితవదనా, నను పరికింపనింతెందైన దాగియున్న నీసుందర్శనమును సంతతానందవార్ధినిముంచవేల? వృక్షలతాదులారా నాయుత్తమేశ్వరుని ధిక్కరించు రూపజితవసంతుని, భూలోకజయంతుని బొడచూపరే? నగములారా నావగలకాని గొన్పింపరే? యని దీనాలాపంబులనాడుచు, నవ్వనసీమనరుగుచుండ కోకిలాలాపకై విలపిం

చెడి మదనమోహనుం డీసామజయాననుజూచి, మృదువాణి యని సంశయించి, యింతకుముందయిన శాంతిచాలదా? నాప్రాణసఖి, నేమిజేసితివి? స్త్రీహత్య జేయనోపనందునకా," యని కరవాలం బునెత్త, నాజిగిబిగులలేమ వగలబోగులుచు, "నాథా నాతప్పుమ న్నింపుము! నీరాకకై యుప్పొంగుచుండిన నాగతి పాలుపొంగినేలబడిన ట్లాయె. నాపాపము నాయొడికట్టిన పిదప శిక్షించుట భూపాలురకు యుక్తమెయుండ తెటాలున పలాయనంబయితినను స్వల్పమిషచే నా యం దిట్టిక్రూరమూన నగునా? నీయంకపాళిజేరి ఆలింగన సుఖము ననుభవించినపిదప ననుజంపిన నాప్రాణంబులగూడ నీకొప్పించెద. అది యుననమ్మతనూయెనేని కడముద్దయిన ముద్దిడనిమ్మని ముద్దుగుమ్మబతి మాల, కంఠధ్వనిచే కోకిలాలపగా నెరింగి, "కాంతా! నేపరమపాపిని, హతమతిని, క్రూరుడను, కృతఘ్నుడను, నమ్మిన చేడియ నడవిపాలు జేసి పరకాంతకై బట్టిన భ్రష్టుడను, ద్రోహిని. ఇంతటి పాపకార్య మొనరించిన నా కరంబును తెగవేసెదను నా తప్పును మన్నింపమని" వేడుచు మదనమోహానుడు తనకరంబును తెగవేయగమకింప కోకిలాలప యతని వారించి, "నాథా! తప్పచేసినవాని విచారించి యాతని తప్పొప్పుల నెరింగినపిదపగదా శిక్షనొసంగవలయు. నీ సేతలచేనాకు తల పోతలు గలిగె. గాన నీకథనువిచారించి తగుశిక్షనేనొసంగెదనన మదన మోహానుడు జరిగినదంతయు సవిస్తరముగ దెల్ప నాలలనామణి యిటు వాక్రుచ్చె." ఇదియొక చపలాక్షిచే చేయఁబడిన తంతుయనుటకు సంది యంబులేదు. ఆ కుటిలాక్షిచే మోసపడి యాపె నంటిన నీ కరద్వయం బు లలయువరకు ననుఁ గౌగలింపుము. ఆశిక్ష చాలునన నొండొరులు గాఢాలింగనంబు జేసికొనిరి.

---

## 9-వ అధ్యాయము.

ఇటు లీకాముకులు దినంబులు గడపుచుండ, మృదువాణి యా సతీపతులకొదవిన అమితసుఖంబును సైపజాలక « మదనమోహనుని కోకిలాలప వశపరచుకొన్నదిగదా! నేనెదురు పడిన యాతడు నన్నొల్లడయ్యె. అది యొకకొరతగనే నెంచుకొనరాదు. నేనెదుర్పడియు నష్టమనోభీష్టనయితిని. కోకిలాలప పరపురుషుని కౌంగిటమెలంగుట నాతనికి చూపినదాని చెలిమిగోరునా? జారిణిని జేరదీయునా? అక్కచెల్లెండ్రమగుటచే మాయిద్దరిరూపు ఒక్కటిగ నుండును? నా చెలియలుదప్ప మరెవ్వరేని నాకన్నరూపరులే! దానిని విడనాడిన పిదప నను ప్రేమజూడడా? ఇతని దాయాదియగు శివవర్మ నీ కార్యమునకు తోడుగా గొని నేపురుషవేషము ధరించి నాచెలియలికడజేరి యాపెను వలసినట్లు వర్ణించి, యీతనిని మోసపుచ్చెదను. మృదువాణి కార్యమదెట్లుభంగపడునని శివవర్మకడకేగి, « రాజా మదనమోహనునకు తన యింటదాసీవృత్తి నున్నసైరంధ్రిపై హెచ్చుమచ్చిక జనించిన ట్లున్నది. వారిరువురు పూరివెలుపలనుండు నుద్యానవనంబున సుఖంబున నున్నవారు. మదనమోహనుడు • కోకిలాలపను పరిణయంబాడిన నాతనికి రాజ్యమందాశ జనించును. అదియొకటి లేకపోయెనా—నాభూకాంతు డితరకాంతఁగోరక సన్యాసివృత్తి నెప్పటియట్లనుండును. కోకిలాలప పరపురుషునితోడఁ బలాయనం బాయెనను వదంతి పుట్టింపుము. ఆవిటుని నేటిసాయాహ్నంబున నాజవ్వనితో కలసి మెలసియుండుతరి చూపెదనని మదనమోహనునితోడ బల్కుము. ఇందులకు తోడ్పడ్డనిను నేపరిణయంబాడెద. రాజ్యంబు నీదగును. నీవు నావాడగుటచే నే రాజ్ఞినగుదుననని జెప్పు,'' దురాశ పైనగొన శివవర్మ బాహాటముగ సైరంధ్రి పురుషోత్తముడను పురుషుని వెంట పరుగిడెననియును

నా విటుని సాయాహ్నంబున నుద్యానవనములో చూపెదననియు ప్రతినఁ జేసెను.

మదనమోహనుని మనంబున కీమాటలు నమ్మోహనాస్త్రము వలె నాటియెద్దియుదోచక తనమనంబును వెలిబడనీక యిటుప్రలాపింప దొడంగె.

‟అకటా! స్త్రీజనమును విశ్వసించిన వెకలులుగలరే? వనితను వక్షస్థలంబున పదిలపరచితినని సంతసించిన విష్ణువు తనసతి చపలాక్షి యయ్యెనను చింతచే నబ్ధిచేరి అందును సుఖముగాంచక ఇహసుఖాపేక్షబాసి వటపత్రశాయియయ్యె. శంకరుడో సతిని తలకెక్కించుకొని, కడపట సాగరునిపాలుజేసి, కపాలపాణియై బిక్షుకుఁడనె. నలువయన్ననో తనయింతి నలుగురి నోటబడెనని మతిభ్రమనొంది యాలయంబునొల్లడయ్యె. ఇంతయేల సురగురు నంతటివాడు తనసతి రారాజుపాలయ్యెనని శక్రునితోడ మొరలిడె. గౌతముడు తనయర్ధాంగిచే గలిగిన మానభంగంబు నోర్వక గుహలఁజేరె. వాలి తనయాలికై సోదరునితోడ సంగరమొనర్చె. ఇంతయునెరింగి వెలుగునకాశించి వుసురులిడిచెడి వుసుళ్ల వలెనే నేలయిట్టిమాయలో చిక్కుకొంటిని? ఇంత సాహసమా? మదిరాక్షుల మాయలకు మితియు మేరయులేదా? ఆహా రాక్షసులకన్న అట్టిట్టని యెరుంగనైతినే? రాక్షసులు పలలాసులైన వీరినేమననగు? నాపై నెంతప్రేమయున్నట్లు నటించె. పురమువెడలు తరిగూడ పడతి వ్రాసియుంచిన జాబుచూచి పయోముఖ విషకుంభంబును గ్రోలిన పాపినైతి. భంగపడితి. పట్టెడిపామును, కొట్టెడిభూతమునైన లక్ష్యపెట్టక, ఈఘాతకికై దేశకాల పాత్రంబులనైన నెంచక, దీనివగవేష్టులకు మోసపడి, భృత్యానుభృత్యుండనై, గడువువిూరక నీసతికడకేగి, కాలము గడపుచుంటి గదా మానవులు, మదన జ్వరపీడితులై,

బుద్ధిమన్నగలని, ఆకలిసున్నా, యన్నులమిన్నల చిన్నెలకు లోబడి, మేనివనజెడి, ఎగ్గునెంచక, సిగ్గుబాసి యున్మత్తులవతా దిరిగెదరు? ప్రపంచమున బుద్ధి బలము శ్రేష్ఠమని కొందరును, భుజబలము శ్రేష్ట తరమని మరికొందరును, దైవబలము శ్రేష్టతమమని పెక్కండ్రును నుడువుచుందురు. బుద్ధిబలమే శ్రేష్టమైన బృహస్పతి తనసతిని శిష్యునిపాలు జేయునా? భుజబలము శ్రేష్టమయ్యేనేని మనుష్యమాత్రునిచే పరశురాముడేల భంగపడును? ఇక దైవబలము త్తమ మందమా శ్రీహరి దశావతార గహనాప్తిని నేలసంకటపడె?

బలమన్న స్త్రీబలమే బలము. నిగురుగప్పిన నిప్పుక భంగి స్త్రీలు పేరుకుమాత్ర మబలలగుదురు గాని, సుబలులను మృగముల వంచింప మరుడనుధీవరుండు వేసిన మాయావల లనుటలకు సందియంబేమి? మారా! నీవుమాత్రము రతికేమరవా? ఇట్టి ప్రళయాంతకుల కెద్ది యసాధ్యము!

అయ్యారో! ఇంతటి యుపకృతినాసతియొనర్చియుండునా? ఇది నమ్మ దగ్గదా? పరపురుషాభిలాష గలిగియుండిన ఇలు వెడలినప్పుడే పలాయనమయిన నేనేమి చేసియుండును? నిన్నటిదినమ్ము నేపడిన మోసమునకం తేలవగచును? నా రాకకై యారా కాసుధాకరవదన రేయంతయు కాచియుండనేల? వలసిన వాని చెట్టబట్టి సుఖంబున నుండగూడదా? ఇంతకుమున్న మృదువాణి నాకూటమికై నను మోసబుచ్చె. ఇవన్నియు యోచింప మృదువాణి నను వరించ వెదకిన యుక్తిగానున్నది. నాజపతపంబుల నీటగలిపి, మనస్థైర్యమువుంటిపాలుచేసి, నిత్యకృత్యములయందైన నిమిషకాలము వెచ్చబెట్టక, ఎవరిరాకకై చింతించి, మాటలకై మోము ద్రిప్పి, సందర్శనమున తనివి నొందుచుంటినో, ఎవ్వరు నా మోముచూడక మనలేమని పలుకుచుండిరో, ఎవరినికానక భుజించినకూరలు కార

మై కమ్మని తేనెలుచేదై తిండి వెగటగుచుండెనో, ఎవ్వరి పలుకులనెడి సుధారసంబునందనివి నొందుచుంటినో, యట్టినాయర్థాంగి, నాప్రాణేశ్వరి, నను బాయనున్నదనుట నమ్మనగునా? అటు బాసిపోదానిని దెగవేసినా యసువులనైన బాసెదనిని నిశ్చయించి కత్తి చేబట్టి కోకిలాలప పాలిటిమిత్తి వలె నియమితస్థలంబునకు గొంతదూరమున డాగియుండెను.



## 10-వ అధ్యాయము.

శుకవాణి గుణనిధిని గాంచిననాటనుండి ఆతనిగుణగణంబుల మనంబున నెంచుకొనుచు నాతని రప్పించుకొని పలుమరు తన సోదరుని మంకుమార్చుమని వేడుకొనుచు ఒకనాడు ప్రస్తావవశంబున నిట్లనియె.

“ఆర్యా, నాసోదరుడు మంకుమానడయ్యె? నీవాతని యాప్తమిత్రుడవగుట నీకెద్దియు దుస్సాధ్యముగానోపదు. నిను నాపాలిటి చింతామణియని నమ్మిన నాచింత బాపెదవో, లేక వంతలగుందించెదవో తెలియకున్నది. నాయనుజుని ఛ్ఛాంత మెరుంగగల జట్టి వీవగుటచే నీరాక కనవరతమువేచి, నీనోట నెప్పుడేమి వెలిబడునోయను పేరాసచే యున్నదానయని నుడివిననుడువు లమృతధారలవలె గుణనిధికిదోచె. యాపలుకులనెంచుకొలది యాతని మేననంపతుంపరలు మదనుడుగురిపించినట్లుండియు తన కాంతస్వామణిపై నున్న పేరాసను వెలిబడనీక సమయంబునకై వేచియుండె. సతీమణియగు శుకవాణి కితని పరిణయంబాడనిచ్ఛయుండియు కోకిలాలప సమాచారము నెరుగనెంచిన కుతూహలముచేతను తనయన్న పెండ్లాడని సంకటముచేతను తనప్రాణంబున కన్న నెక్కువగనున్న సైరంధ్రికాన్పింపని పరితాపమువలనను, ఒక

శారిక నెదుటనిడుకొని తనశయ్యపై పరుండి నిదురంటియుంటక "రూప రేఖలావణ్యంబుల నేమి, వచనరచనలందేమి. గుణగణంబుల నేమి నిధి యన్న గుణనిధియే గురి. ఆతని యంతరంగంబు తెరంగెరుంగువరకు నే బయలుబడరాదు" అని కలువరించిన మాటలను విన్న చిలుక యాపాఠము ను లవముదప్పక వప్పగించుచుండ గుణనిధి దానినెరింగి శుకమా శుకవాణిని నాకు కూర్పవే నిను నేమరువను. చేసినమేలెవ్వడేని మరచునే ముందు వెనుకలనెంచక పంచభాష ప్రతాపచంద్ర నాటకి మాడనెంచి పంచపాండవులన మంచము కోళ్లవలె ముగ్గురన్నట్లు మూడుభాషలతో నొక నాటకమును ప్రదర్శించి ఆషేలనమునకై సత్పాత్రలు లేమిం జేసి జరిగిన కాలహరణమునకై జిత్తుమాటలపల్కి నాకృతఘ్నత కాన్పింపనే *కపటనాటక సూత్రధారుడనని యెంచకు- తేట తెనుంగున గద్యపద్యంబుల వ్రాయించుకొన్న పిదప పిల్లలజాతచే నెల్లర నుపేక్ష జేసి ఆత్మస్తుతి పర నిందల నెల్లర దూషింప నేక్షుల్లక ప్రదర్శకుడగాను. మూడడుగులని ముల్లోకంబుల దానముగొని బలిని పాతాళంబునకు ద్రొక్క వామనుడగాను అని పలువిధముల బతిమాల మరల దీనినాశుకము పాడదొడంగె. ఇట్లు శుకవాణి గుణనిధులొండొరుల నెరింగి తమస్వాంతమును నొక్కరికి దెల్పకుండిరి.

---

*కొందరు నాటకమును ప్రదర్శింపగోరి తెలుగు భాషలో కొన్ని పద్యాదుల వ్రాయించుకొన్న పిదప తమపని యయ్యెనను ధైర్యముచే నుదాసీనముగ మాటాడను నాటక మొక్క భాషలోనున్న నేరికేని విన మక్కువ బుట్టునని నొక్కి జెప్పిన మాట లింపుదోపక నాటకమును కలగూరగంప జేసి కోతికి కుళ్ళాయి పెట్టినట్లు తెలుగు భాషనికి కన్నడపాత్రమును కన్నడినానికి కఠికతురక పాత్రమును నిచ్చి నాటకమును వ్రాసినవారిలో శైలి కఠినమని కొందరిని, తమ కావచన రచన ఇంపు దోపదని కొందరి నిందింప కంపెనివారికి సహాయ్యభూతులుగనున్న వారలో కొందరు సభవార చెలిమి మాన నాటకము వైదికుని చేతి విడెమయ్యె. అంత నాసభికులు తమకార్యము తూగించుకోలేక తమకై పలువురుపడ్డపాట్లను మరచి కృతఘ్నులై దూషింపదొడంగిరి.

మృదువాణి పురుషవేషముధరించి కోకిలాలపఁజేర నానతీమ ణి ఇదియేమిబింత, ఈ వేషమేమునియన మనముచిన్ననాట నాడిన ఆట లు జ్ఞప్తికివచ్చి ఇక నెన్ని నాళ్లకు నినుజూడగల్గెడినో యను సంకోచము చే నాగోమునీకు జూపవచ్చితినని కోకిలాలపను కౌగలించి ముద్దిడ కోకి లాలపయుబోరని యేడ్చెను.అంత నామృదువాణి తనచెలియలినితనతోడ పైనిడుకొని మనునివిరి, నాపాణపదక మా,కనుసన్న సఖులచే తనయాజ్ఞ గొను నీకిదివరకు యొకరి యాజ్ఞమెలంగవలసెగదా? ఆహా! ఈభారతి యింట దాసీవృత్తినెటులుంటివే.హీనసేవజేసి యొరులకు బయలుపడకుండ గూఢంబున నుండవిరించి వ్రాసియుండ దానిదప్పింప నెవరివశము? నిన్నేఘాతకి ఇటుగొని తెచ్చె నే?ఆనాడు నీవుపాలుగ్రోలినతరిపడిన సంకట ముచేతను, ఇన్నీమరునాడు పెందలకడ నిను పొడగాంచమి గలిగిన క లకలము చేతను నాకుగలిగిన వ్యాకులత నేమని వచింతు? " అని చెక్కిలి నొక్కి మూర్ధంబు నాఘ్రాణించి, "సఖి!నీ కేల నీయరణ్యరోదనము?ద్రవ్య ము లేకున్న నీయుంగరముసైన విక్రయించి యొకనగరంబుఁ జేరి సుఖం బుననుండు మని ఒకయుంగరమును కోకిలాలప కరంబుననిడి గాఢా లింగనంబు జేసి నీకార్యమునకునేతోడ్పడియెదను. నలయునన్నునీ వెంట వచ్చెదనన. కోకిలాలప తెల్లగున్నదంతయు పాలనినమ్మునదిగాన రోదన మునశాంతింప మృదువాణి నాపెనోదార్చి చిన్నగపనివినెను.

## 11-వ అధ్యాయము.

దీనినంతయుఁజూచి మదనమోహనుడు తాలిమిచెడి తటాలున నచ్చోటుబాసి గుణనిధిజేరి రుద్రాకారుడై యరుణనయనంబులమేను మ రచి యిటువచించె:—

"ప్రాణసఖా! నీసఖ్యత చూపనిదియెతరి. నామాటకు జవదాటక నాయాజ్ఞప్తికిలోబడవలయు. అదియెట్టియవాచ్యమగుసంగతిగానున్నను జేసెదనన్ననుడివెదను. ఆహా! నేనేమని నామాట వెలిబడనిత్తును. ఇంతసాహసమా? ఇంతటిమోసమా? నాకేసర్వాధికారమును సర్వశక్తియు నా పరమేష్ఠి యిచ్చియున్న స్త్రీయనెడివంశాంకురమైన నుండనీక భస్మంబు జేసి బడబాగ్నిచే చక్కగపుటము వేసినపిదప నాహుతిగాగొని యుందునుగదా? ఏమీ, స్త్రీజాతినా? ఆమాటనుటకు సహితము నోరాడదే! నాకెట్టిద్రోహమొనర్చినను, ఎంతటి చెడుసేతలుజేసిననుమానె. ఆయింతికిఁ జీమంత బాధగల్గుట నేచూచి యోర్చి భరింపగలనా? లలనామణీ! ఇంతగానమ్మిన నన్నెవరిపాలుజేయనెంచితివి? ఇంటగుడిచి యింటివాసము లెక్కించినట్లు ఉప్పుబెట్టినవాని కంటికి కప్పువేసితిగదే? నీపేరన్నమాత్రంబునసె నాశస్త్రాస్త్రంబులు నేలబడును. అని వదరుట జూడనొల్లక గుణనిధి "మిత్రరత్నమా సంగడీడుల మోసబుచ్చుట మావంగడంబునకని వినియెఱుగను. చిన్ననాటనుండి అన్నదమ్ములవలె నొకరిగోప్యంబులొకరికెరిగించుచున్న మనకు, నొకరియండబాసి యరనిముసమైననుండ జాలనట్టి వారిమాటలొండొరులకు వికటించునా? పూవులోని పూపిందెవలె నినుపెన్నిధిగా నెంచిన నావంటివాని తటాలునఁదోసివేసెదవేల? కాయ్యతీగకుభారమగునా? కాకున్న నీయట్టియాప్తమిత్రునికే ద్రోహంబుజేతునే? బాల్యమునుండి నాగుణము నెరింగిన నీవేనాయందు సంశయించిన నేనే మననగు? నీ గుట్టెరింగించి ననుగట్టిజేర్చిన నీ కపకృతియొనర్చిన జట్టి నెట్టులైన నా సాహసముకొలది పోరాడి చెండాడెద. దయచేసి తెలియ బల్కవే యన మదనమోహనుండు చివాలున లేచి, కరవాలంబుల రెంటిదెచ్చి అందుపడవైచి, నీనుడువుల మరువవలదని ఒక కరవాలంబును గుణనిధికిచ్చి మరియొకటిని తాచేబట్టి—అయ్యో ఫలపుష్పాదుల

నొసంగి యాలింగనాదిసుఖంబులనన నలవిగాని ఎన్నోసుఖంబుల ననుభవించిన యీకరంబున—నాకిసలయపాణిని—యేమననగు—తెగవేయ తలంపిరి తనంబు జాలకున్నదే—యీసతీమణిపేరు నుడువుదమన్న నోరెగయకున్నదే—ఆకాంతను చేబట్టి ఇక నెన్నోసుఖంబుల ననుభవించి యీయన్నులమిన్నను సంతతానందవార్ధి దేల్చుదు ననుదురాశ మనంబున బెనగొనుచుండెనే? కాంతా, నా కట్టెదుట నాహంత జేరి, యీతని యంకపాళిమెలంగి—, నాయింతినొక్కదు తొడపై నిడుకొని, మేనునివిరి, శిరంబు నాఘ్రాణించి, అయ్యో, బింబాధరచుంబనంబొనర్ప! నారాజబింబముఖి నెరులపాలుజేసి యోర్చి భరింపగలనా? సఖా! గుణశేఖరా! నాకులవిధ్వంసినిని నే చేబట్టనెంచిన కోకిలాలపను, కత్తికొకకండగనరికి మిత్తి దేవత కాహుతి నొసంగుము. దీనికి గారణమిపుడు నన్నడుగకుము. ఆ కులఘాతకినిఁ జంపినపిదప నంతయు నవిస్తరముగ దెల్పెద. ఇందులకు మారాడి నాతో కయ్యమునకు కాలుద్రవ్వమన్నయెడ పోర నుద్యుక్తుడవు గమ్ము. ఎట్లైనను సైరంధ్రిమునికి నా చెవిబడగూడదు. నను దక్కించుకొన నెంచిన నీపని శీఘ్రంబె జేసిరావలయు. కాలవిళంబమైన నాసతిని గూడినవన్నెకాడొదేని తిన్నగ జారును. సైరంధ్రిని నూరివెలుపటి యుద్యానవనములో జూడనగును వైళంబ పని వినుమని మదనమోహనుండు కోకిలాలపతోనున్న విటునకై కటికకిరాతునిబలె కత్తిచేఁబూని పరుగిడెను.

మృదువాణియు మదనమోహానుని వంచించితినను సంతసమున తిన్నగ తనయిలు జేరనెంచి తనబుద్ధిని తానె మెచ్చుకొనుచు వచ్చుచుండ త్రోవలో మదనమోహనుం డామూతపూరుషున కెదుర్పడి ఓరీ! నరాధమా! ఎటకేగెదునిలునిలు. ముగ్ధయగునాసతీమణిని, నాప్రాణపుబంగారుబొమ్మను, బేలవుచ్చితివా? నీకుపరకాంతలపై యాశయేల?

కన్యకామణి కావలయునా? ఇదే యామృత్యుకన్యను గొనుమని సిగఁ బట్టి నేలఁబడఁద్రోయ మృదువాణితలపాగ నేలఁబడెను. వెంటనే ఆకాంతామణి ముంగురులును కృష్ణవేణియు నగుపడ సీమంతినీలలామ యనుట దేటపడెను.

మృదువాణియు గద్గదస్వరంబున మదనమోహనునితో నిటు వక్కాణించె.

“భూకాంతా! మృదువాణియనపలువురనోటఁగరగెడి గెడియభాగ్యవతి నేనే. లలితపురి నేలువిక్రమసేను కూతును. నీవు చెట్టబట్టనెంచిన కోకిలాలప సోదరిని నీయనుంగు చెలియలు శుకవాణి లలితపురిఁ జేరి నీరూపరేఖలావణ్యాదుల బలుతెరంగుల వర్ణించిన నాటనుండి, ఎటులైన నను నిను పరిణయంబాడవలెనను నిచ్ఛజనించి, తోబుట్టువనియైన నెంచక కోకిలాలప కొకరేయి మత్తుమందిడి తెలివిదప్పి పడియున్న యాకలుపకంటి నదయుత వధియింపుమని, కటా! కటికల కప్పగింప, తానొకటిదలంప దైవమొకటి దలంచు” ననుటకు నిదర్శనముగ దైవవశంబున నాకాంతామణి మీాయిలుజేరి సైరంధ్రీవ్రతంబుననుండి, మొట్టుకు నీమన్నన లంది, నీమనంబాపె యందు లీనమగునట్లు చేసికొనెను.

పాపిజనకుడు విక్రమసేనుఁ డక్కసెల్లెండ్ర మము నిద్దరిని నీకొచ్చి వివాహమొనర్ప నున్నాడనుట నెరింగి నాచెలియలిపై హెచ్చుమచ్చరముజనింప నిర్దోషియగునా కోకిలాలప కండకావరంబున మిండలపాలై పలాయనంబాయెనను వదంతి బుట్టించి మజ్జనకున కాపెపైక్రోధము గలిగింపఁ జేసితి. ఎట్టకేలకు నీవు నను పరిణయంబాడ నిశ్చయించితి వను శుభపత్రిక మాపురి జేరినవెంటనే నీసతియగుభాగ్యము చేకూరెనను సంతసంబున హాస్తిపురి జేరి నీకు కోకిలాలపపై నుండు మచ్చికను మాన్పనెంచి నీ దాయాదియగు శివవర్మతో నాలోచించి యెన్నెన్ని

చెడుసేతలుచేసి కడకు నీచేభంగపడిన వ్యర్థమనోభీష్టను నేనే. అట్టి నిర్భాగ్యురాలు మని యెవ్వరికేమి యుపకారము చేయవలయును? లేదా నేనేమి సౌఖ్యపడవలయు? నాబ్రతుకారడాయె గాన నే నికమన నొల్ల. వాపీకూపతటాకాదుల ప్రాణత్యాగము జేయనెంచి ఆత్మహత్యఁజేసికొనుటకంటె నీచేఁ జచ్చుట మేలు. దయచేసి తెగవేయు"మని మృదువాణి మదనమోహనుని నెంతయు బతిమాలెను.

మదనమోహనున కీసంగతి చెవిబడ్డతోడనె "అయ్యో! మంచి చెడుగరయక మృదువాణి చెడుసేతలకు మోసపడి నాసతిని తెగవేయ మంటిని. ఎద్దియునెరుగని ముద్దరాలిని నిర్దయదూలనాడితి. తాలిమి తన్నుగాచునను తెలివిలేకపోయె. బుద్ధిమన్నుగలిసె. తనునమ్మిన తన్వీమణినకారణంబుగ జంపించిన పతితుడనైతి. నాసతి నాకులేదాయె. ఇంకేమిగతియొ తెలియదాయె. కాంతా,నీకొరకెంత విలపించిన నేమిప్రయోజనము? కలనైన గాన్పింపవా? ఆహా! కనుమూసిన కట్టెదుటనిల్చి నట్లున్నదే, కట్టా! ఇంకెటులైతు? నాబుద్ధిమాంద్యము నాతోడబోక నునునమ్మిన తమ్మికంటికి కష్టము గలిగించె. ఇక నిను నేజూడగలనా! లలనా,వలరేని బాధనావల నెటగుఆవలదోతురే? ఈవార్త లోకంబెరింగిన నన్నేమందురు? బూటకసన్యాసియని నీవన్నమాట తప్పకపోయె. ఏమి! మైమరచి నేపదరుచుండ గుణనిధి నాసతిని వధియింపకుండునే? గుణనిధీ, నీవైన నాయాజ్ఞప్తికి కారణంబడుగవైతివి? విధిబలవంతమై యుండ నెవరేమి జేతురు. వైళంబ యుద్యానవనముజేరి నాసతీమణి మోమైనజూచి కడముద్దైన నిడెదనని" మూరాడక బరుగిడెను.

---

## 12-వ అధ్యాయము.

గుణనిధి మదనమోహనుని యాజ్ఞానుసార మా చంద్రకాంత వేదిక జేరి అటపరుండి నిదురించెడి యా చంద్రముఖిగాంచి జంపజేయా డక ఇట్లుప్రలాపింప దొడెంగె:—

అకటా! నాయట్టిపాపు లీలోకమునఁగలరా? మదనమోహనుని తోడి చెలిమిచేసినందులకు నకారణంబుగ స్త్రీహత్య నెడిగట్టుకొనవలసె. ఈసతీమణిని నాసఖునకుగూర్చి పలువురశ్లాఘునకును భూపాలుని కృపాకటాక్ష వీక్షణలకును శుకవాణి చెలిమికిని పాత్రుడనగుదు నను కొనియుంటిని. ఈతనితోడ నేస్తమునకై ఒకకర్మము నెరుంగక హాయిగ పరుండి నిదురించెడి ఒకయబలనకారణంబుగ జంపవలసె. ఈ సంగతి శుకవాణివిన్న నన్నేమనును? లోకులునను కాకులవలె బొడవకుందురే? హరిహరీ, ఎంతటిపాపము! ఇట్టియపకృతి దైవమైననోర్చునా? వాడియుండియు అకళంకంబగు మోముచంద్రుని ధిఃకరించుచున్నది. దానిని కృష్ణాహిబట్టనున్నదోయన పెన్నెరవేణీ గన్పట్టెడి. దీనియోష్ఠము కెంపు వీక్షణాంచలముల నుండి వెలిబడ్డ న్యాసాగ్రయంప ఘాతచేగల్గిన రుధిరంపుసొంపు మింపించుచున్నది. ఆముకుర కపోలకంఠంబునుండి వెలిబడు చెంగల్వచాయ తాంబూల చర్వణమహాత్యమని యూహింపనగు. ఆ కొమ్మకరంబులు తామరతూండ్లోయన పాణితలంబు కిసలయంబు నపహాసించుచున్నవి. తననిపుణత జూపవిరించి పసిండిపై కతమున నమృతంబుగల్పి యీ కనకాంగి ప్రతిమను చేసి పదునాల్గులోకంబుల మరాళగమనల విరాళిజెందించినట్లున్నది. ఇన్నిగల్గిన నావన్నెల చిన్నదాని, ఆయన్నులమిన్న నకారణంబుగ దెగవేయుటెట్లు? ఆపె తనకొనర్చిన యపకృతినైన దెల్పక మదనమోహనుడు నన్నీపనికి నియమించె. సైరంధ్రీ!

నీవతని చెలిమిఁగోరకుండిన నెందేనిమనియుండుదువుగదా? ఇనుమునుగూర్చి యగ్గికి సమ్మెటపోటుగల్గినట్లు మదనమోహానునకై నే నీపాపము నెడికట్టు కొనవలసె"నని యిటుగుణనిధి మైమరచి ప్రలాపించుచుండ జేతినుండిజారి నేలపడ్డ కత్తినిజూచి, యీ మానహీనకృత్యంబు జేయనొల్లక నాయసి నాచేతినుండి దప్పించుకొని పోనున్నది. దానికున్నంతబుద్ధి నాకులేదయ్యె. కాంతామణీ! ఆ భూకాంతుడెటు తెంపు జేసెనోగాని నినుజూచుకొలది నామనంబు నీరసమగుచున్నది. మెడకుబడ్డపాము కరువక తీరునా? మిత్రుని రక్షింపవలెనన్న క్షాత్రత నూనవలెనని" నిదురించెడి కోకిలాలపనుజంప కత్తిపైకెత్త "చంపకు, చంపకు, కొంచెము నిదానించు"మనెడి శబ్దము వినబడెను. గుణనిధి తిరిగిచూచి మదనమోహానుడగుట నెరింగి చంపుటమానెను. మదనమోహానుడు పరుగెత్తివచ్చి, కన్నుల నీరునించి కోకిలాలప, నాభాగ్యమే భాగ్యము, నాసుకృతవశంబున నిను నేడక్కించుకొంటినని నిదురించెడి కోకిలాలపను గాఢాలింగనంబు జేయ హరిణాక్షి భీత హరిణంబుమాడ్కి చివాలున లేచి దుమికి కరవాలంబులు కైనున్న నిరువురగాంచి యెద్దియుదోచక నోరాడక గడగడవడకి పరుగిడనెత్తించి ఎటుబోవనుదోఁపక కరయుగళంబుల కండ్లుమూసికొని మోహముపడినప్రమానువలె కొంతనిలుచుండి గద్గదస్వరంబున "నాకర్మ నేమందును? నేనొకటియు నెఱుంగనుగదా? భూమ్యాకాశములతోడు, పంచభూతములసాక్షిగా, మీపాదమాన నేనూరక నిటుపరుండి యుంటిని. సదయత చూడుడీ? చంపకమా, నీకైన యనుకంప జనియించి నాపంపున మాటాడవేల, నగములారా రాజును శాంతింప జేసి నాదిగులుమాన్పరా." యని దీనాలాపంబు లాడుచుండ సేవకుడొకజాబుదెచ్చి మదనమోహానునికియ్య, అతడాజాబువిప్పి "జననీజనకులారా, అక్కసెల్లెండ్రనిద్దరిని మదనమోహానునికియ్యనెంచిన నాట

# పంద్రెండవ అధ్యాయము

నుండి కోకిలాలపపై చెప్ప నలవిగాని యసూయత జనింప [illegible]ంత లకప్పగించి పట్టెనిందలుగట్టి నాగుట్టెపుడు బయల్పడునో యనుభీతిచేఁ గంటికి నిదురంటక కనుమూయ కోకిలాలప కట్టెదుట నిల్చినట్లగ పడ, చచ్చినభూత మిటువచ్చెనని మనంబున నొచ్చుకొనుచు రాత్రం తయు కాలముగడపుచుండి, హాస్తిపురిజేరి అట రాజమందిరమున సైరంధ్రీవ్రతమునన్న నా చెలియలిగాంచి పట్టిబూతుల నాపట్టిని బెదరించి యూరువెడలించితిని. ఇంతజేసియు మదనమోహనుడు నను పరిణయంబాడ నొల్లమి శివవర్మను పెండ్లాడెదనని వెలయాలికులు కులనాతని నావలలో తగలించుకొని యాతని సహాయంబున పురుష వేషధారినై మదనమోహనుని మోసబుచ్చి అతనికి కోకిలా లపపై నసూయత జనింపజేసితి నేచేజేత చేసుకొన్న దెవ రనుభ వింతురు ? నేపడిన పాట్లన్నియు బనికిరాక మదనమోహనుడు నను దిరస్కరించినదే గాక పలువుర హేళనలకు పాత్రనైతిని. మనదగ దని విసము మెసవితిని. కోకిలాలప మదనమోహానునితోడ నూరికి తూర్పుననుండు నుద్యాన వనమధ్యమందున్నది. వారికి పరిణయంబు జేసి ఒకరిని చెడుపనెంచిన తాజెడుననుట్లకు నాజాబు నెల్లరకు జది వి వినుపింపుడు. ఇటు తమపుత్రిక,

హాస్తిపురి విడిది. మృదువాణి.

ఈజాబును విన్నతోడనె మృదువాణి పుట్టించినవార్తయుఁ బు రుషవేషంబున మదనమోహానుని మోసపుచ్చిన తెరంగును, మృదువా ణికైన భంగంబును తేటబడెను. కోకిలాలపపై సంశయించి నాపెను జంపింపనెంచినందుకు క్షమింపమని మదనమోహానుడు గుణనిధి కోకి లాలపలను వేడుకొన కోకిలాలప తనచెలియలు మృతినొందియుండున నుభీతిచే హాస్తిపురికేగుదమన వారట్లుజేసిరి.

[illegible]మంగళవాద్యంబులకు బదులు రోదనవాద్యంబు వినబడె. మృదువాణి పెండ్లికై వచ్చిన బంధువర్గము చెప్పనిభోజనంబు గుడిచి చనవలసె. సేకరించిన సామగ్రులు షోడశంబున కుపయోగింపవలసె. విక్రమసేనుని కడుపుకాలె. దీనినిచూచి సైపజాలక కోకిలాలప బోరనియేడ్వ మదనమోహనుడు మృదువాణిజేరి మూర్ఛిల్లియుండుట నెరింగి చల్లని నీరావెపై జల్ల నామెకు మెల్లమెల్లన తెలివివచ్చె. ఎల్లరయుల్లంబులు సంతసిల్లె. విక్రమసేనుడు కోకిలాలపను కౌగలించి ముద్దిడె. శుకవాణి డెందమానందమాయె. భారతి తనకోడలను పలువిధంబుల కొండాడె. వచ్చిన అమ్మలక్కలు మృదువాణిని యేటుమాటల సూటిగవేసిరి.

వీరవర్మ గుణనిధిని పలుతెరంగులబొగడి తనసుతుని మంకుమాన్పినందుకు తనసుతయగు శుకవాణి నాతనికి దానమొసంగె. మృదువాణి శివవర్మకొసంగిన వాగ్దత్తము మేరకాతనికి జతజేసిరి. మదనమోహనుని కోకిలాలప కొసంగిరి.

ఈవధూవరుల నందరిని నిల్పి వేదవిదులయిన కోవిదులయభిప్రాయము నెరుంగింప కన్యలు లజ్జావనతముఖులయిరి. భారతి కోకిలాలప మృదువాణు లొకపీటనుండనయ్యెనని చిరునవ్వునవ్వె. కోకిలాలప కోరిన కాంతునితో కలసిమెలసియుండగల్గెనని కాంచనాంగి కన్నెగరవేసె.

ఇటులందరు పరమానందంబున మేళతాళంబుల మంగళవాద్యంబులు జెలంగ వివాహములన్నింటెని హాస్తిపురిని జరిపిరి.

అంత విక్రమసేనుడు చివాలునలేచి గుణనిధీ నిన్నెగడ నెవరితరము. మనుష్యుల కెద్ది యసాధ్యము. నీచాతుర్యముచే మదనమోహనుని మంకుమాన్పితివి. నేలముచ్చువలెనుండి గచ్చుకూతలబుట్టించి

